





# జీవిత చరిత్ర

## గాంధీజీ

## గాంధీ ధర్మ చక్రం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# గాంధీ ధర్మచక్రము



శ్రీ స్వామి తత్వానంద

# గాంధీ ధర్మచక్రము

శ్రీ స్వామి తత్వానంద

: ప్రకాశకులు :
శ్రీ స్వామితత్వానంద గ్రంథ ప్రకటన సంఘము
శ్రీ తత్వానంద శిలాశ్రమము
(వయా) మంగళగిరి

# పరిచయం

ముంజేతి కంకణమునకు అద్దమువలె 'గాంధీ ధర్మచక్రమ'ను నీ గ్రంథమునకు పరిచయ మవసరమని నేననుకొనను.

జగద్విఖ్యాతుడైన గాంధీ మహాత్ముడు అనేక సందర్భములలో వెలువరించిన వివిధ విషయములకు సంబంధించిన అభిప్రాయము లిందు అకారాదిగ కూర్చబడినవి.

'అంతర్వాణి' తో ప్రారంభించి 'క్షేమము' వరకు రెండువందలకు పైబడిన రకరకాల శీర్షికలిందున్నవి.

ఈ గ్రంథమును కూర్చిన పూజ్యులు శ్రీ శ్రీ శ్రీ తత్వానంద యతీంద్రులు గాంధీ మహాత్ముని ఆశయాల కనుగుణంగా జీవితమును సాగించిన తపోధనులు. ఆంధ్రమాత అనుంగు బిడ్డలలో అగ్రశ్రేణికి చెందిన మహాపురుషుడు. ఇట్టి మహనీయుని గ్రంథప్రకటన నిమిత్తం శ్రీ తత్వానంద శిల్పాశ్రమ పక్షమున ప్రత్యేక సంఘమేర్పడుట, వీరు ప్రప్రథమంగా 'గాంధీ ధర్మచక్రము' ప్రకటనకు పూనుకొనుట చాల ముదావహము. రైతుపెద్ద, దేశభక్తుడు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య యం. యల్. సి. గారి అధ్యక్షతను ప్రారంభింపబడిన శ్రీ తత్వానందస్వామి గ్రంథ ప్రకటన సంఘమువారు తాము పూనిన కార్యమును దిగ్విజయముగా సాగించి ఆంధ్ర ప్రజల మన్ననలను పొందుదురుగాక !

శ్రీ సర్వోత్తమ భవనము
పటమటలంక
27-4-1960

పాతూరి నాగభూషణం,
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము



శ్రీగొట్టిపాటి బ్రహ్మయ్యగారు, యం. యల్. సి.
శ్రీ స్వామి తత్త్వానంద గ్రంథ ప్రకటన
సంఘాధ్యక్షులు

# గాంధీ ధర్మచక్రము

## అంతర్వాణి :

ప్రతివానిలోని అంతర్వాణియు అతడు వినని, వినకపోని వాని చెవిలో నిల్లు చెప్పుచునేయుండును. "నీ ప్రత్యేక ధర్మము నీకున్నది. నీ జయాపజయములకు నీవే కర్తవు. ఏలయన ? నీకుసాటి నీవే. సర్వకర్త ఒకదాని నాటినప్రతివుగా మఱొకదానిని సృష్టి కల్పన చేయుటలేదు. కావున నీ ధర్మమును నీవు నిర్వహింపనియెడల ఇంకెవ్వరును దానిని పూర్తిగ నిర్వహింపజాలరు. అయ్యది అట్లు అసంపూర్తిగా తప్పక నిలిచియే పోవును.

అంతర్వాణిని ఆలకించు అర్హత తేస్పులో ఎడతెగక సాగించిన సాధనవలనను, భగవత్కృప వలనను లభించును. ఈ సాధనను చిన్న గడ్డిపోచ కొనతో, సముద్రపు నీటినంతను ఎగచిమ్మివేయు యత్నముతో, శ్రీ శంకరాచార్యులవారు పోల్చియున్నారు.

## అందము :

సత్యములన్నిటిలోను సత్యభావనలు మాత్రమేగాక సత్యప్రకాశములగు ముఖములు, సత్యప్రకాశములగు బొమ్మలు, కీర్తనలు మున్నగు అన్నిటిలోను అందమున్నది.

సాధారణ మానవుడు సత్యమునుండి దూరమైపోయి, ఆందలి అందమును కనుగొనజాలకున్నాడు. యథార్థమగు అందము వినిర్మల హృదయమునందుండును.

అధిక సంఖ్య:

అధిక సంఖ్యాబలము పరిపాలకానందము గొలుపును. పూర్ణ భావస్వాతంత్ర్యమున్న వారైన అధిక సంఖ్యాకుల మాట చెల్లవగినదే. అంతరాత్మానుసరణమైన ఈ అధిక సంఖ్యా ప్రసక్తి యుండజాలదు. హెచ్చుమంది యేమి నిర్ణయము చేసినను చెల్లవలయుననుట కానిసతనమగును.

అనుసరణము:

అనుసరణము వేఱు. అనుకరణము వేఱు.

అరాచకము:

అరాచకము దాస్యముకన్న మిన్న.

అలంకారము:

అతివకు సత్యమగు భూషణము ఆమె శీలమే. మేలి లోహములు, రాళ్లు ఆమెకు అలంకారములు కాజాలవు. సీత, దమయంతి – ప్రముఖ నారీమణులు మనకు పవిత్ర ధ్యేయమూర్తులై నిలుచుట అనింద్యమగు వారి వర్తనమును బట్టియే; కాని వారెన్నడేని ధరించియుండజాలు ఆభరణముల బట్టికాదు.

అవసరము:

భారతపౌరుల కిప్పుడు అవసరమగునది చదువను, వ్రాయను, లెక్కలు వేయను అనుకూలించు చదువుకాదు. ఆర్థిక జీవనమును గుఱించియు, దానిని బాగుపఱచుకొను విధానమును గుఱించియు ఉపకరించు తెలివి అవసరమై యున్నది.

అశ్రద్ధ :

మనము శాస్త్రములను అశ్రద్ధ చేసి నదీతీరములను, నివాస సమీప స్థలములను మురికి చేసివేయుచున్నాము. అవ్యోచ్ఛంబులందు ఈగలు, దోమలు పుట్టి పెరిగి, అనేక వ్యాధుల వ్యాప్తికి కారణములగుచున్నవి. అశ్రద్ధచేసి పూడ్చివేయని మలములపైని వ్రాలి, అవియే పుణ్యతీర్థములలో స్నాన మాడిన మన శరీరముల పైనను, మన ఆహార పానీయముల పైనను వ్రాలి సర్వమును అసహ్యము చేసివేయుచున్నవి.

ఆశ్రమ ధర్మము :

బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము అను నాలుగాశ్రమములును హిందూమతము లోకమునకు ప్రసాదించిన అపూర్వమగు కానుక.

నేడు మన కనులకు పొరలు క్రమ్మినవి. ఆలోచనలు చెడినవి. మనము హైందవ ధర్మమును తిరస్కరించితిమి. సమాజ శరీరమును చెఱచితిమి.

అస్పృశ్యత :

అస్పృశ్యతా దోషము హిందువుల హృదయమును మలినపఱచుచున్నంతకాలము ప్రపంచ దృష్టిలో మనము అస్పృశ్యులమే. అస్పృశ్యతా నివారణకు, ఒకరి యిండ్లలో నొకరు కలిసి భోజనములు చేయుటగాని, పెండ్లిండ్లలో వియ్యములు చేయుటగాని ప్రధానమని నే నెంచుటలేదు. నాకు వర్ణాశ్రమ ధర్మములందు నమ్మకము కలదు... నా అస్పృశ్యతా నివారణోద్యమునందు పరస్పర వివాహ సమస్య

లేనట్లేదు... ఒక్క కులములోని వారైనను అందఱు కలిసి భోజనములు చేయనక్కఱలేదు... మతముచేత అంగీకరింపబడు అస్పృశ్యత (పారిశుద్ధ్య కర్మకు సంబంధించి) తాత్కాలికమైనదిగ నుండును. అది కర్మకు సంబంధించినదిగాని, కర్తకు సంబంధించినదికాదు. పరిహరింపదగియుండును.

**అస్పృశ్యులు :**

స్పృశ్యు లనబడువారు అస్పృశ్యు లనబడువారిని అసహ్యించు కొనదగదని కోరువిధముననే స్పృశ్యులను ద్వేషింపవలదనియు, అసూయపడవలదనియు అస్పృశ్యులకు మనవి చేయుచున్నాను. పాశ్చాత్య దేశములందువలె దౌర్జన్య పూర్వకముగా తమ హక్కులను గుంజుకొన వలదని కోరుచున్నాను. దౌర్జన్యమునకు వ్యతిరేకముగా లోకాభిప్రాయము మారుచున్నది. హక్కులను పశుబలప్రయోగము వలన నిర్ణయించుకొనుట అసంభవమగు కాలముయొక్క రాక ప్రపంచములో నాకు విస్పష్టమగు సూచనలతో గోచరించుచున్నది.

**అహింసాస్త్రము :**

శిక్కులు తమ యుద్ధ వీరత్వమును ఋజువు చేసియున్నారు. ఐనను తమ కృపాణమునకు మారుగా అహింసాఖడ్గమునో, లేక ఆధ్యాత్మాస్త్రమునో ధరించినప్పుడే – గురుగోవిందసింగుని – ఆదర్శప్రాప్తి వారికి కాగలదు. ఒకడు ఖడ్గమును చేత ధరించియున్నంతకాలము అతడు పూర్ణ నిర్భయస్థితిని పొందినట్లు కాదు. మీరు అహింసాస్త్రమును

భరింపగల్గితిరా, ప్రపంచములో నే శక్తియు మిమ్ము నిర్జింప జాలదు. ఆది విజయుని, విజితుని - ఇరువురను ఉద్ధరింప జాలును.

ఆంగ్లము :

ఇక బాలికలకో! ఇంగ్లీషు సంబంధాలకు అదొక యోగ్యత కాబట్టి వారికి ఇంగ్లీషు చెప్పించుచున్నారు. ఇంగ్లీషు దొరలతో ఇంగ్లీషులో మాటలాడుకొనుటకు, చాల మంది తమ స్త్రీలను ఇంగ్లీషు నేర్చుకొనగోరువారిని నేనెఱుగుదును. తమ స్నేహితులతో తమభార్యలు ఇంగ్లీషులో మాటలాడ నేరరని విచారపడు భర్తలనుకూడ నేనెఱుగుదును. ఇంగ్లీషుభాష నే మాతృభాషగా చేసికొనిన కుటుంబముల నయితము నేనెఱుగుదును.

మన దేశభాషలను పోషించకుండ మట్టిపాలు చేయుట చూడ నాకు భరింపరాని విచారము కలుగుచున్నది. మన దేశీయులు తమబిడ్డలకును, భర్తలు తమ భార్యలకును, ఉత్తరములను తమతమ మాతృభాషలలో వ్రాయుటమాని ఇంగ్లీషులో వ్రాయుటను చూచి నేను సహింపజాలకున్నాను.

మన సాధారణ జీవిత సరణినిబట్టి స్త్రీలుగాని, పురుషులుగాని, ఆంగ్లభాషా జ్ఞానమును సంపాదించుకొనుట అవసరముకాదు. నేటిస్థితియందు జీవనోపాధిని గడించుటకును, రాజకీయములందు తీవ్రమగు కార్యకలాపముల నడుపుటకును పురుషులకు ఆంగ్లము అవసరమనుమాట కొంతవఱకు నిజమే. స్త్రీలు జీవనోపాధిని గడింపవలయుననిగాని, వాణిజ్య వ్యాపారముల పూనుకొనవలయుననిగాని, నాకు విశ్వాసములేదు.

ఆంగ్లము నేర్వవలసినట్టిగాని, నేర్వనభిలాషగలట్టిగాని కొలది మంది స్త్రీలున్నచో, వారును పురుషులకేర్పడిన పాఠశాలల కేగి సులభముగా నేర్చుకోవచ్చును. స్త్రీలకై యేర్పరచబడిన పాఠశాలలందును ఆంగ్లభాషను ప్రవేశపెట్టుచో మననిస్సహాయ స్థితిని పొడిగించినవారమగుదుము.

మనకీనాడు నేర్పబడు తీరు ఆంగ్లవిద్య ఆంగ్లభాష నేర్చిన భారతీయులను నిర్వీర్యులజేసివేసినదని నాకృతనిశ్చితాభిప్రాయము. విద్యార్థియొక్క నాడీబలముమీద అమిత భారమునుమోపి నిలిపివేసినది. మనలను బొమ్మగ అనుకరణ శీలురను చేసినది. ప్రాంతీయ స్వభాషలను నెట్టివేయు ఈవిధానము మనకు నాటిల్లిన బ్రిటిషు సంబంధమునందొక్క చరిత్రమున బహువిషాదమయప్రకరణ మనందగును.

ఇంగ్లీషుభాషలో ఆలోచనలు సాగించుట, తమ భావములను ఇంగ్లీషుభాషలో ఇతరులకు తెలుపవల్సిన పని ప్రారంభమునుండియే పైబడకుండిన యెడల, రామమోహన రాయలు ఇంకను ఘనతర సంస్కర్తయై ప్రకాశించెడివారు. శ్రీ బాలగంగాధర్ తిలక్ శ్రేష్ఠతర విద్వాంసులై వెలింగ డినారు. వారికి ప్రజాళిపై గలిగిన పలుకుబడి ప్రభావము అద్భుతమైనదేయైనను వారు బాల్యమున పెరిగిన వాతావరణము అట్టిదిగాక, తక్కువ అస్వాభావికమైనదై యుండిన యెడల, ప్రజలపైని వారిప్రభావము ఇంకను ఎన్నిరెట్లో హెచ్చియుండెడిది. ఆంగ్లసాహిత్యనిధియొక్క పరిచయము వలన వారెంతయో లాభమును పొందియున్నారనుట నిస్సందేహము. కాని ఆలాభము వారికి తమమాతృభాషల ద్వార

మునకే (అనువాద గ్రంథముల ద్వారమున) ప్రాప్యమై యుండవలసినది.

చైతన్య, కబీరు, నానకు, గురుగోవిందసింగు, శివాజీ, ప్రతాపుడు మున్నగువారు రామమోహనరాయలు తిలకుల వంటి గొప్ప పురుషులని నా గట్టి నమ్మకము.

## ఆంగ్ల నిక్షేపములు:

ఆంగ్ల వాఙ్మయమందలి విజ్ఞాన నిక్షేపములను స్త్రీలకును, పురుషులకునుగూడ సమముగా లభ్యము చేయవలయునని నా వాదన కలదు. ఆ నిక్షేపములను స్త్రీలకుగాని, పురుషులకుగాని అప్రాప్యములుగ చేయు నుద్దేశ్యము ఎవరికినిలేదు. ఎవరికేని పఠుభాషాభిలాష గలదేని ప్రపంచము నందలి సాహిత్యము నంతటిని పఠింపకుండ అడ్డుపెట్టు వారెవ్వరమిని లేరు.

ఒకానొక ప్రత్యేక సమాజముయొక్క అవసరములను దృష్టిలో నిడుకొని తదనుగుణమగు విద్యాప్రణాళికలను రూపొందించు సందర్భమున భాషాభిరుచి మెండుగ గల ఏ కొలదిమంది ప్రత్యేకపుటవసరములనో తీర్చుటకు సాధ్య పడదు.

## ఆత్మ ఒక్కటే:

జీవులకు అనేకములగు శరీరములున్నను ఆత్మఒక్కటే. సూర్యుని ప్రతిబింబములు అనేకములైనను మూలతేజము ఒక్కటే. నేను అత్యంత పాపాత్ముని నుండియు వేఱుపడి యుండజాలను. అటులనే అత్యంత నిర్మలాత్మునితోడను ఐక్యత నాకు లేకుండ పోదు.

ఆత్మోపలబ్ధి :

ఆధ్యాత్మిక తత్వజ్ఞానమునే ఆత్మోత్కృష్టతయని తఱచుగా మనము భ్రాంతి పడుచుందుము. పారమార్థికత అనగా వేదాంతశాస్త్ర పరిచయము కాదు. తత్త్వశాస్త్ర వినోదములందు సమర్థత యుకాదు. అది హృదయ సంస్కృతి; మఱియు అనంత ప్రభావిశాలమైనది. ఆధ్యాత్మికతకు ప్రప్రథమలక్షణము అభయము.

నాకు అద్వైతమునందు విశ్వాసము కలదు. మానవులందఱు ప్రధానముగా ఒక్కటేయనియు, ఇంతేల, జీవకోటి యంతయు ఏకమే యనియు నానమ్మకము. కావున ఒక్కడు పారమార్థికముగా ఉత్కృష్టుడు కాగలడేని, లోకమంతయు ఉత్కృష్టత గాంచగలదు; ఒక్కడు పతనము గాంచునేని జగమంతయు, అంతమట్టుకు పడిపోవలసినదే. నాకు నేను సాహాయ్యము చేసికొనకుండె, నా సహచరుల నందఱికిని సాహాయ్యము చేయజాలకుండె, నా విరోధికి నేను సాహాయ్యము పడజాలను.

ఆదేశము :

అర్ధరాత్రివేళ ఒక శబ్దము నన్ను లేపి "ఉపవాసము సలుపు" అని చెప్పినది. "ఎన్నిదినములు?" అంటిని. "ఇరువదియొక్క దినములు" అని జవాబు వచ్చెను. అట్టి ఉపవాసమునకై నామనస్సు స్థిరపడియుండలేదనియు, అది నా కనిష్టముగ సయితముండెననియు గట్టిగ చెప్పగలను. ఐనను మఱే విషయమైనను ఎంతస్పష్టముగ తెలియ నీలుండునో

అంత విస్పష్టముగా నాకది తెలియవచ్చినది. నాజీవితములో నేను ఏ ప్రముఖ కార్యములు చేసినను తర్కముచే ప్రేరేపింపబడిగాక సహజప్రేరణచేత చేసియున్నాను. దీనినే భగవంతుని ప్రేరణచేతనని నేనందును.

### ఆ ధా ర వి ద్య :

ఆధారవిద్యాపద్ధతి యనెడు నవీనవిద్యావిధానము అవలంబింపనిచో, భారతావనిలోని కోట్లాది బాలబాలికలకు విద్య యనందగున దేదియు లభ్యము కాజాలదు.

### ఆ ధా ర ము :

ప్రతివాడును తనలోని భగవంతునిపైని ఆధారపడి నిలబడుటను నేర్వవలయును. ఆ భగవంతుడొక్కడే అమోఘమును, శాశ్వతమునునగు మార్గమును జూపువాడు. ఇట్లు ప్రతివాడును, తనపై తానాధారపడినట్లగును.

### అ ను భూ తి :

తిలకమును; తులసిని ధరించుకొనునంతనే వచ్చులాభ మేమి? జపమాల త్రిప్పినను, నామజపము చేసినను ప్రయోజనమేమి? వేదములకు వ్యాకరణసూత్రానుగుణ్యముగ వ్యాఖ్యలు వ్రాసినను ఫలమేమి? వాఙ్మయపాండిత్యము ఘాత్రిగ గ్రహించినను వ్యర్థమే. ఇవన్నియు పొట్టనింపుకొను ఉపాయములే. పరబ్రహ్మానుభూతిని పొందుటలో తోడ్పడజాలవేని ఇవన్నియు నిష్ఫలములే.

(2)

అర్థలోభము:

డబ్బుసేవను ఉపదేశించు శాస్త్రమును, పేదలనెత్తిని చేయిపెట్టి వారిని దరిద్రులచేయుచు సిరులను ప్రోగుచేసికొను ఉపాయములను భాగ్యవంతులకు నేర్పుశాస్త్రమును మోసపుటర్థశాస్త్రము అననలయును. అదొక అనర్థశాస్త్రము. అది వినాశకారి. యథార్థమగు అర్థశాస్త్రమో సంఘమునందు అందఱికిని న్యాయమును గూర్చును. అతిదీనులకు సయితము క్షేమమును గూర్చును. మర్యాదగ బ్రతుకుటకు దారిజూపును.

ఇంగ్లాండు అమెరికాల అర్థశాస్త్రము భారతదేశమునకు పనికిరావు. యంత్రపరిశ్రమలతో నగరములందు బ్రతుకు ఆజనులకు ఉపకరించు స్వేచ్ఛావ్యాపారపద్ధతి మనకు పనికిరాదు. ఆప్రజలు అన్యులను పీకుకొని బ్రతుకుటకు సెనుకాడరు. వారిఅక్రమపు వర్తకమును కాపాడుటకు పెద్దపెద్ద నౌకా సైన్యములను, ఆకాశ విమానదళములను పెట్టుకొని యితర దేశములపై దాడులు వెడలుదురు. ఆరీతి అర్థశాస్త్రము వారికి నచ్చును. ఆతీరుస్వేచ్ఛావ్యాపారము భారతీయులయెడ శాపమైనది. వారిని బానిసతనమున కూల్చినది.

నీతినినాశనముచేయు ఐహికసంపదలుఎట్టివైనను మనకువలదు.

ఈశ్వరార్పణం:

నరుడు సర్వమును ఈశ్వరార్పణముచేసి, పిమ్మట తన అవసరములబట్టి వినియోగము చేసికోదగును. ఇట్లనుటవలన ఒకనికిధనమున్నయెడల అతడు తనసొమ్మునంతను పారవేయవలెననియో, ఆలుబిడ్డలను ఇంటినుండి వెడలగొట్టవలెననియో అర్థముకాదు. అతడు వీనియెడల రాగమునుమాత్రము విడువ

వలయును. తనశక్తులనెల్ల ఈశ్వర సేవయందు వినియోగింపజేయవలయునని అర్థము.

నాకు ప్రపంచమిని రాజ్యాధిపత్యము అక్కఱలేదు. స్వర్గపదమువలదు. మోక్షము సయితము కోరను. దుఃఖములచే పరితపించువారిబాధను నివారించుశక్తిని మాత్రము కోరుకొందును.

నేనును, నాభార్యయు కామోపభోగమును త్యాగము చేసినపిమ్మటనే, అదియు నడివయస్సులో నున్నప్పుడే, మేము యథార్థమగు గార్హస్థ్య జీవితానందమును అనుభవింప జాలితిమి. అప్పుడుమాత్రమే మాసాహచర్యము సఫలీకృతమైనది. భారతదేశమునకును, సమిష్టిని మానవజాతికిని మేమిరువురమును నిజమగు సేవచేయ సమర్థులమైతిమి.

జనులు జిహ్వాచాపల్యమును తృప్తిపఱచుటకై తిండ్లు తినుచున్నారు. అట్టిభోగమునకునికిధర్మమనజాలము. అనేకులు తినుటకు బ్రతుకుదురు. బ్రతుకుటకు తినువారు అరుదు.

భోగముకొఱకు లెక్కలేనన్ని పెండిండ్లు చేసికొనుచున్నారు. వివాహధర్మముయొక్క పవిత్రతను, యోగ్యతను అనుభూతి చేయుకొఱకును, తన్మూలమున, ఆంతర్యమునందుగల ద్వైతత్వమును సాక్షాత్కరింప జేసికొనుటకును పెండ్లిచేసుకొనువారు అరుదుగనున్నారు.

ఈశ్వరవాణి :

నేను "ఈశ్వరవాణి"ని ఆలకించు అనుభవమును కలిగియే యున్నాను. విన నిరీక్షించుట మాత్రముకాదు. నేను

దాని నాలకించిన కొలదిని భగవంతునికి నేనెంత దూరమున
నున్నదియు నాకు అధికాధికముగ తెలియవచ్చుచున్నది.

ఉ ద్యో గ ము లు :

ప్రభుత్వోద్యోగముల సందర్భమున సాంఘికాభిమానముల ప్రవేశపెట్టితిమా, సత్పరిపాలన నాశనమగును.

ఉద్యోగముల పంపకము ఆయాసంఘముల సంఖ్యయొక్క నిష్పత్తినిబట్టి జరుగరాదు. వెనుకబడిన సంఘముల వారు జాతీయ ప్రభుత్వమున ప్రత్యేకపు ఆదరణను పొందదగును. విద్య గఱపు సందర్భమునను ఇతర శిక్షణలు పొందు విషయమునను ప్రత్యేక సౌకర్యములను కోరదగును.

ఉ ద్యో గు లు :

ప్రభుత్వోద్యోగిపదవులలోనికి వచ్చువారెల్ల ప్రజాసామాన్యముయొక్క యోగక్షేమములను ప్రధానముగా నెంచుచు వారియెడల విశ్వాసపాత్రులగు సేవకులై స్వార్థరహిత నిగర్వమూర్తులై వర్తింపవలయును.

యథార్థమునకు దొరతనము ప్రజలది. ఉద్యోగులా ప్రజలదాసులు. ఆదాస్యము తమకొఱకుగాని, తమపక్షమువారి కొఱకుగాని కోరుకొనుట ఎవ్వరికిని తగదు.

ఏ మ రు పా టు :

ఉన్మాదపీడితుల నట్టనడుమను దుమికి, ఆసోదరులకు కనులు తెఱచు తెఱవు జూపయత్నించుచున్నాను. నాఅలసట, నా దుర్బల దశ విచార్యములు కావు. "శరీర మాద్యంఖలు ధర్మసాధనమ్" శరీరము పట్టుపరుపులలో పొదిగి, దాచి రక్షించుకొఱకు వచ్చినదికాదు.

ఋణము :

నరుడు ఋణవిముక్తిని సంపాదించుకొను నిమిత్తము శరీరధారియై జన్మించుచున్నాడు. దైవమును, వాని సృష్టి ప్రకృతి ద్వారమున సేవించి ఋణము తీర్చుకోనగును. ఈ విషయమును దృష్టిలో నుంచుకొనుచో, నరుడు శరీరము నకు పోషకుడగుచున్నాడు. అప్పుడు తన శక్తికొలది లోక సేవ యొనర్చుటకే శరీరపోషణ చేసికొనుట వానికి విధాయక మగుచున్నది.

ఐహిక సంపద :

రోమక సామ్రాజ్యము ఐహిక భోగభాగ్యములలో అత్యున్నత పథమును చేరినప్పుడే నైతికపతనము నొంది నాశనమైనది. ఈజిప్టు అటులనే యైనది. అనేకములగు యితర రాజ్యముల విషయమున అటులనే జరిగినదనుటకు చారిత్రకాధారములు చాల గలవు. శ్రీ కృష్ణభగవానుని కుటుంబమువారును, బంధువులును భోగభాగ్యములందు ఓల లాడుచున్నప్పుడే పడిపోయిరి. అత్యంతము ఐహిక భోగ ములు నైతికపతనమునకును, నైతికపతనము సర్వనాశనము నకును దారితీయును.

శ్రీమంతుడు మోక్షరాజ్యమున ప్రవేశింపగల్గుట కంటె, ఒంటె సూదబెజ్జమున దూర్చుట హెచ్చు సులభము.

మన మాతృభూమి యొకప్పుడు దేవతావాసమై యొప్పెనందురు. ఇప్పుడో మిల్లులు, ఫ్యాక్టరీలు నల్లని పొగలు వెలిగ్రక్కుచుండ, వాని రొదలతో వెగటుదోచుచు, ఎటు చూచినను రోతపుట్టించు దేశమైనది. రాజమార్గము

లన్నియు, నియమము నిలుకడ లేక పర్వులువెట్టు ఇంజను లతో చీకాకు గొను దేశము, తామేమి గోరి యెచ్చటి కేగుచున్నది తెలియని నరులతో కిక్కిరిసిపోవు కారులతో అలజడిపాలగు దేశము, పెట్టెలలో రాళ్లు రప్పలు వేసి కూరునటుల రైలుబండ్లలో నొక్కబడి, ఊపిరాడక ... మతి దూరులై తిరుగులాడు ప్రజతో నిండిన దేశము, అదను చిక్కినప్పుడెల్ల తమను నెట్టివేయజూచు విదేశీయుల నడుమ పడి నీలుగుచు, సందుచిక్కి చేతనగునెడల వారిని మరల నెట్టి వేయ నుబలాటబడుచుండు దీనజనుల దేశము, కటా! భారతభూమియేనా, ఒకప్పుడు దేవతావాసమై యొప్పెనని గొప్ప చెప్పుకొదగిన దేశము అనిపించుచున్నది.

కట్నములు:

కట్నము కోరు యువకుడు విద్యయొక్క విలువను వమ్ముచేయుచున్నాడు; దేశమునకు సిగ్గు దెచ్చుచున్నాడు; స్త్రీజాతిని అవమానపఱచుచున్నాడు.

సాంఘికమును, నింకను నితరములును నగు దోషముల నెదిరించి పోరాడుటకు బాలురను, బాలికలను సమర్థుల చేయజాలని విద్యాపద్ధతిలోనే ప్రధానమగు లోపమున్నది. ఆచార వ్యవహారములలోని దైనందిన సమస్యలను సరిదిద్దుటకై బాల బాలికలకు సమర్థతగూర్చు విద్య యొక్కటియే సమాదరణీయమగును.

కమ్యూనిజము:

కమ్యూనిజముయొక్క మూల విశ్వాసము యోగ్యమైనది. అది యిక్ష్వాకులనాటి సిద్ధాంతము. లెనిను వంటి

ధన్యాత్ముల త్యాగములచే పవిత్రీభూతమైన ఆదర్శము వ్యర్థము కాజాలదు.

గాంధీజములో హింసా కల్మషము చేరినచో కమ్యూనిజమగును; కమ్యూనిజమును పుటముపెట్టి హింసను తొలగించిన యెడల గాంధీజమగును.

దౌర్జన్యరహిత విధానమునవలబింపగల కమ్యూనిజమునకు సదా స్వాగతమే! అప్పుడు ప్రజల క్షేమలాభముల కొఱకు, ప్రజల పక్షమున శ్రీమంతుల కడ సంపదలుండనగును. అప్పుడు సమిష్టి ప్రయోజనమునకు వలయునెడ, ఎప్పుడు పట్టిన అప్పుడు, ప్రభుత్వము ఆ సంపదలను స్వాధీనము చేసికోగల్గును.

కమ్యూనిస్టులు :

కమ్యూనిస్టులు దేశమునంతటిని తమ భావమునకు త్రిప్పుకొనెంచుచున్నారు. హితవాదముతో దేశీయులను ఒప్పించుటచే వారటుల చేయవలయునేగాని, దౌర్జన్యముతో కాదు. మీ పక్షమునకు తిరుగనివారిని మీరు హింసింప బూనుదురు. అటుల మీ రెంతమందిని నాశనము చేయగలరు? కోట్లకొలంది జనమును మీరు హతము చేయజాలరు. మీ పక్షమున లక్షలకొలంది జనులున్నచో, కొన్ని వేలమందిని చంపజాలుదురు. అది తగినపని కాదు.

మీరు కమ్యూనిస్టులమని వక్కాణించుకొనుచున్నారు. కాని కమ్యూనిస్టు సూత్రానుగుణ్యమౌ జీవితమును గడుపుచున్నటుల కాన్పించదు. ఉత్తమోత్తమ భావమున కమ్యూ

నిష్ఠ ఆదర్శమునకు అనుగుణ్యముగా జీవించుటకు నా శక్తి కొలది యత్నించుచున్నానని నేను మీకు చెప్పగలను.

పరమోత్కృష్ట ప్రయోజనమును సాధించుటకైనను, హింసా పద్ధతుల ప్రయోగించుటన, నా కెంతమాత్రమును గిట్టదు ...

ఐనను, నా అహింసావ్రతము అరాచకులయెడను, హింసాచారమున విశ్వాసము కలవారియెడను మైత్రి చూపుటను నిషేధించకపోవుటేగాక, విధించునుకూడను.

సిరిసంపదలలో అక్రమముగ సంపాదించినదానిని లాగివేయవలయుననుట కమ్యూనిస్టుల సిద్ధాంతము. ఇందు అక్రమముగ సంపాదించిన వేవియో నిర్ణయించున దెవరు? భగవంతు డొక్కడే అట్టుల నిర్ణయించగలడు; లేదా ధనికులు, దరిద్రులు కలిసి యేర్పాటుచేసికొనిన మధ్యవర్తులు అలా నిర్ణయించవలయును. ఎవరు పట్టిన వారు, తమకై తామె నిర్ణయాధికారము పూనదగదు; అందుకు మారుగా ఆస్తి యనునదే యుండదగదందురా? అట్టులగుచో, అందఱును తమసంపదలను విడిచివేయవలసియుండును. మన మందఱమును అట్టుల విడిచివేసినవారమేనా? మనము ముందుగ ప్రారంభించి, పిమ్మట మనను అనుకరింపుడని ఇతరులను అడుగవలసియుండునుగదా? వేఱువిధానము లేదు.

కొందఱు కొందఱు కమ్యూనిస్టులు అహింసావాదులగుట నే నెఱుంగుదును. మీరు మీ విధానమున రహస్యమును త్యజించి, సర్వత్ర నిష్కపటముగ వర్తించుడు. పెట్టుబడి సాహుకారుని వెనుక సుసంఘటితమైన సామ్రాజ్యచర్య

కలపడుట నిజమే. కమ్యూనిజము వెనుకనో సంఘటితముగాని కృత్రిమముగా సౌజన్యచర్య యున్నది.

కమ్యూను :

సబర్మతీ ఆశ్రమమునందున్న స్త్రీలు తమ కుటుంబ ములు వంటయిండ్లను ఒకే సమిష్టిపాకశాలగా కలిపివేయుటకు, తమకుటుంబములవారు కానట్టి బిడ్డలను చేరదీసి, తమబిడ్డల వలె పోషించి సాకుటకు, తమబిడ్డలను ఇతరుల పోషణక్రింద నుంచుటకు, పరస్పరము ఉత్సాహముతో ఒడంబడిరి. ఇదొక కమ్యూను.

ధర్మచక్రము :

కర్మచేయుట నీవంతు; ఫలనిర్ణయముజోలి నీదికాదు. కర్మ విధి; ఫలము హక్కు.

నిర్వహించిన విధులన్నియు హక్కులను ప్రసాదించి తీరును. అనుభవించిన హక్కులన్నియు బాధ్యతలను సృష్టించు చుండును. ఇట్టుల విధులు హక్కులు అనెడు కడియాల చక్రము నిరంతరము తిరుగుచునే యుండును.

కర్మసిద్ధాంతము :

నాకు కర్మసిద్ధాంతమునందు గట్టినమ్మకము కలదు. కర్మబంధనమును నిస్సంగ కర్మచేత త్రెంచుకొనుటయే జన్మ పరమావధియని నాఅభిప్రాయము. ఒకజీవి బ్రతుకుయొక్క అంతమునకు కారణమై, దాని ఘోరబాధను తొలగించుట కర్మసూత్ర భంగమనునెడల, రోగులకు ఉపచారములుచేసి, వారికి పునరారోగ్యకల్పన చేయుటయు అందుకు భిన్నమగు

కార్యము కాజాలదు. నేను అపన్నులకు ఏమాత్రపు ఉప కృతి చేయగలిగినను, అటులచేయుట నాకిది విధియని మాత్రము నేనీసందర్భమున చెప్పదలతును.

కామ విజయము :

కామవిజయము స్త్రీగాని పురుషుడుగాని సాధింపజాలు విజయములలోని కెల్ల ఘనతమ మైనది.

కాంగ్రెసు :

కాంగ్రెసువాది యథార్థపు ప్రజాసేవకుడు. అతడు సదా ఇచ్చునేగాని, యితరుల సేవనుకోరడు. వానికేవిధమగు సాంఘిక దురభిమానములు నుండదగదు. వినయముతో ఉదారముగా అతడు ఇతరులసేవచేయును.

కాంగ్రెసు ఏయొకవ్యక్తి స్వామ్యమునుకాదు. ప్రపంచ మెన్నడును కనివిని యెఱుగనంత విశాలముగా ప్రజకు అధి కారము నంగీకరించుసంస్థ. ప్రజలు తెలివిగా ఎంతఅధికారము నైనను పరిపాలనమున తమ ప్రతినిధులద్వారమున చెల్లింప గల్గుదురు. గ్రామికుల గౌరవమును కాంగ్రెసు పాటించు నంతగా ప్రపంచమున ఇంక యేసంస్థయు పాటించునదిలేదు.

కులము :

హిందూమతము చాలవిశాలమైనది. మతాంతరుల గావించు ఆచారము అందులేదు. అది ప్రాచీనకాలమందెట్లు న్నదోయిప్పుడు నట్లేయున్నది. అది బౌద్ధమతమును దేశము నుండివెడలగొట్టినదనుట పొరబాటు; దానినితనలో లీనము

చేసికొనినది. దానియందు జాట్టులోపములను తొలగించి, సంస్కారములను ప్రవేశపెట్టినారు.

## కులపద్ధతి :

కులపద్ధతియనెడు వివాలవ్యవస్థ సమాజముయొక్క ఆధ్యాత్మికావసరములకేగాక, రాజకీయావసరములలోను ఉపకరించినది. దాని సాహాయ్యమున గ్రామీణులు తమ ఆంతరంగికపు చిక్కుల నెన్నిటినో తీర్చుకొనెడివారు; ప్రభువులవలనగాని, అధికారులవలనగాని కలుగు పీడలను తొలగించుకొన గలిగెడివారు. ఈకులపద్ధతిద్వారమున తమ అద్భుత నిర్మాణకౌశలమును కూర్చుకొగలిగిన భారతజాతికి నిర్మాణసమర్థత లేదనివాదించుట విపరీతము. హరిద్వారము నొద్ద కుంభమేలా సమయమున వెళ్ళిచూచినచాలును; సునాయాసముగా పదిలక్షలకుపైగానుండు యాత్రికుల కుల సంప్రదాయముల ననుసరించి ఎట్లు సదుపాయములు కూర్చబడు చుండునో గమనించువారికి కులసంప్రదాయములందు నిర్మాణ చాకచక్యమెంతయున్నదో ద్యోతకము కాగలదు.

## కోపము :

కోప మొకరీతిసిచ్చి. మహోద్యమము లెన్నియో దానిచే భగ్నమైనవి. నాకు కోపమురాదనజాలను. దానిని అణచుటకు ఓర్పును ప్రయోగింతును; సాధారణముగా జయమేకలుగును. కోపి అహింసయెడ ద్రోహి.

**క్రోధము :**

ఒకవేళ లోకులతో తగాదాలు పొసగినను, అహింసా పరులు, తమ సజ్జనత్వమువలన వైరుల క్రోధమును చల్లార్చి వేయగల్గుదురు.

**క్రమశిక్షణ :**

మనమేదేని ఘనమును శాశ్వతమునగు కార్యమును సాధించుటకుపూర్వము, నిశ్చల కఠిన నియమబద్ధులము కావలయును. ఆనియమవర్తనము కేవలము పాండిత్యప్రకర్ష వలనగాని, యుక్తిచేగాని, తర్కవాదము మూలమునగాని లభ్యమగునది కాదు. విపదయను విద్యాలయమున మనము శిక్షణ గనవలయును.

ఓరిమి పోనాడితిమా యుద్ధమున ఓడినట్లే.

బలాత్కారమునకులోనై మనము నియమవర్తనమును నేర్వజాలము.

**క్రొత్తరాజ్యములు :**

యురోపియనులు మాంసపుముక్కకై మొగపడు కాకులవలె క్రొత్తరాజ్యములకై మొగబడుచుందురు. అందుకు కారణము అధికోత్పత్తి చేయువారి 'ఫ్యాక్టరీలే' యని నేను భావించెదను.

భారతభూమికి స్వరాజ్యము కావలయును గాని, అది ధర్మమార్గమున ఆర్జించినదిగా నుండవలయును.

దేశము సదా యేకరీతి నేయున్నది. కాని, కటా! మనము అవినీతిపాలై పోతిమి.

కృష్ణుడు :

మూర్తివంతమును, శుద్ధ సంపూర్ణమునగు జ్ఞానమే భగవద్గీతలోని శ్రీకృష్ణుడు....

ఖద్దరు ప్రోత్సాహము :

దొరతనమువారు తమవంతుపనిగా, అవసరమగు చోటులనెల్ల ప్రత్తివిత్తనములనుగాని, దూదినిగాని సేకరించి తాముకొన్నధరకే గ్రామస్థులకు అందచేయవలయును. వస్త్ర నిర్మాణమునకు వలయు పనిముట్లనుగూడ ప్రోవుచేసికొన్న కరీదునకే కోరినవారి కియ్యవలయును. వాయిదాల వారీగా ఐదేళ్లకో, అంతకన్నను హెచ్చు కాలమునకో ఆసొమ్మును రాబట్టుకోవలయును. అవసరమగు చోటులందు పనుల నేర్పు వారిని పంపుచు, ఆయా గ్రామస్థులు సిద్ధముచేయు ఖద్దరులో వారు వాడుకొనగా మిగులుదానిని దొరతనమువారే కొనుటకు బాధ్యత వహింపవలయును. ఇట్లు ఆర్భాటమేమియు లేకుండ, స్వల్ప వ్యయముతో గుడ్డ కఱవు తీరిపోగలదు.

గీత :

ఈ ధృతరాష్ట్రుడు, యుధిష్ఠిరుడు, అర్జునుడు ఎవరు? కృష్ణు డెవరు? వీరందరు చారిత్రిక పురుషులేనా? యుద్ధ మొకటి నిజముగా జరిగియుండనే వచ్చును. దుర్యోధనుడును వాని పక్షమువారును అధమప్రవృత్తులును, అర్జునుని పక్షమున ఉత్తమప్రవృత్తులును, మన దేహమే కురుక్షేత్రమువని నేను భావింతును. నరుడాయుద్ధమున పాల్గొనుచునేయున్నాడు. కాని అట్టి యుద్ధము వాని ధర్మముకాదు. ధర్మము ఏకైక స్వరూపము కలది. అహింసయన మోక్షమే. మోక్షమనగా

సత్య సాక్షాత్కారమే. గీత హింసనుండి బయటకుపడు మార్గమును బోధింపుచున్నది.

సంశయములు నన్నలముకొను నప్పుడు, ఆశాభంగము నాకెదురై నిలిచి భీతి గొలుపుతరిని, ఎచ్చోటను ధైర్య కిరణము గోచరింపని స్థితిలో నేను భగవద్గీతవైపు చూతును. అయ్యది నన్నోదార్చును. అది బుద్ధిని హృదయమును తృప్తిపఱచును. అది తత్వసిద్ధాంతము, భక్తిశాస్త్రము కూడను. దాని బోధ విశ్వ జనీనము.

గీతా పఠనమనగా చిలుకవలె శ్లోకములను చదువుట కాదు; దాని బోధను ఆచరణలో అనువర్తించుటయే.

గీతా ప్రతిపాదిత సన్యాసమునకు సర్వకర్మత్యాగము సమ్మతముకాదు. నియత కర్మ లన్నియు చేయుము; కర్మ చేయనివాడవై నిలుపుము. ఇదియే కర్మలో అకర్మభావమును గనుట.

కేవలము శరీరముతో పనుల చేయుట 'కర్మ'.

ధర్మాధర్మవిచక్షణా పూర్వకముగ చేసిన 'కర్మయే' వికర్మ.

వికర్మ స్వభావముగ పరిణమించిన పిమ్మట ప్రయత్న బలమంతగా లేకుండ సాగించు కర్మయే 'అకర్మ'; చేసియు చేసితినను విశేషజ్ఞానము కలుగని పనులు. (ఇచ్చట కర్మయనగా కర్తవ్య కార్యమే.)

నాకు జననము నొసగిన యీలోకపు తల్లినిగోల్పోయి చాల కాలమైనది. అప్పటినుండి (గీతయను) యీ శాశ్వత జనని ఆలోటునుదీర్చి నా ప్రక్కను నిలిచినది. ఈమె

యెన్నఁడును మానుటలేదు. నాకెన్నఁడును నిరాశ గొలుపుట లేదు. నాకేదేని యిబ్బంది కష్టము వాటిలినప్పుడెల్ల ఆమె యండను జేరుదును.

ఈ సనాతన మాతృదేవి (గీతామాత) యాజ్ఞను అక్షరతః పాలించు నతఁడు మనస్సున నెన్నఁడును ముదిమిని పొందఁడు. అట్టివాని తనువు కాలగతిని ఒడిలి ముడుచుకొని పోయి మంచిచెట్టుయొక్క ఆకులు లీల (ఋతుధర్మము నను సరించి) శుష్కింపనగును. కాని, వానిబుద్ధిని సదాయౌవన దశయందే పుష్టివంతముగనే విడిచి పోగలఁడు.

ఇక కర్మదోషమునుండి తప్పించుకొనుటెట్లన, నిష్కామ కర్మవలన అని గీత చెప్పుచున్నది. కర్మఫలముల నన్నిటిని ఈశ్వరార్పణము చేయుము.

విరాగము మాటలతో వచ్చునదికాదు. యథార్థ జ్ఞానము నిస్సంగత్వమున కవసరము...

భక్తిలేనిది జ్ఞానము అసంభవము.

గీత ప్రతిపాదించు భక్తి మూఢవిశ్వాసముకాదు. వేద పారాయణములు, తులసిమాలధారణ, బాహ్యక్రతు కలాపములు భక్తిలక్షణములుకావు.

అటువంటి భక్తిజ్ఞానములు కర్మఫలత్యాగ మనెడు పరిశోధనకు నిలువవలసి యుండును.

కర్మచేయక యెవరును సిద్ధిని బడయలేరు; జనకుఁడు సయితము కర్మద్వారముననే మోక్షమును సాధించెను. 'నేనును' అలసభావముతో కర్మను విడిచితినేని లోకములు

నశించును. సామాన్య ప్రజకిక కర్మ నాచరించుట యెంత
ఆవశ్యకమో విచారించుము.' అని శ్రీకృష్ణబోధ.

ఫల పరిత్యాగమునందు అహింస యిమిడియున్నది.
నీవంతు కర్మను చేయుము; ఆకర్మ ఫలమును త్యజించుము.
...ఇది గీతా బోధ.

గీతార్థ సారము:

'అనాసక్తి యోగము' అనెడు నాగీతా ప్రవేశికయందు
గీత అహింసను కూర్చిన గ్రంథముకాదనియు, హింస్యాది యుద్ధ
చర్యను ఖండించుకొఱకు రచింపబడి యుండలేదనియు అంగీ
కరించి యుంటిని. హిందూమతము ఈనాడు ఆచరణలో
నుండు తీరునగాని, యెన్నడైనను అనువర్తింపబడి యున్న
తీరులగాని, నానలె యుద్ధముల ఖండించుటలేదు. ఐనను నేను
చేసిన దేమనగా, హింసాధర్మ మూలభావమునుగుఱించియు,
గీతాబోధను గుఱించియు, నవీనమును, సహజమును, యుక్తి
యుక్తమునగు వ్యాఖ్యను తెలుపుటే. ఇతర మతములమాట
అటుండ, హిందూమతము సంతత పరిణామము పొందు
చున్నది. దానికి ఖురాను, బైబులువంటి అధికార గ్రంథ
మొకటిలేదు. హిందూధర్మ గ్రంథములు పరిణామముపొందు
చున్నవి, సంఖ్యలో పెరుగుచున్నవి. గీత అటువంటివానిలో
నొకటి. కర్మ, సన్న్యాసము, యజ్ఞము మున్నగు వానికి నూతన
నార్థ కల్పన చేసినది గీత. హిందూమతములోనికి నవ్య జీవ
నము పోసినది. ఒక స్వతంత్ర ధర్మశాసనమును ప్రతిపాదిం
చినది. తత్పూర్వపు వ్రాతలలో సూచింపబడనిదాని నేదో
గీత నూతనముగా ప్రతిపాదించు చున్నదనుట కాదు; అయా

ధర్మసూచనల కొక నిర్దిష్ట స్వరూపము నొసగుచున్నది. ప్రపంచమునందలి యితరమత గ్రంథములను ప్రార్థనాపూర్వకముగ పఠనచేసి పొందిన వెలుగువలనను, గీతలో వివరింపబడినట్టుల హిందూధర్మమును జీవితమున ననువర్తింప యత్నించుటలో గలిగిన నాస్వీయానుభవముచే పొందిన వెలుగువలనను, నేను హిందూధర్మమునకు విపులార్థము నొసగ యత్నించితిని; ఐనను విశాలములగు హిందూధర్మ గ్రంథములలో బలాత్కారముగ చొప్పింపబడిన అర్థమెంతమాత్రముగాక, తల్లి బిడ్డతో మాట్లాడుతీరున సజీవ విశ్వాసమునుబోలు వ్యాఖ్యయే నాయది. నేను గావించినది, పూర్తిగ చారిత్రానుసరణాచర్యయే. నేను నాపూర్వులవలంబించిన పంథానే అనువర్తించితిని. ఒకప్పుడు వారు దేవతల క్రోధమును శాంతింప జేయుటకై జంతుబలుల నొసంగియుండిరి. వారికంటె మనకు దాపగు పూర్వులు మొదటివారి పరంపరలోనివారే. 'బలి' అనుమాటకు వేఱగు అర్థమును చెప్పి, బలియర్పణము మన క్షుద్రాహంకార తృప్తి కొరకుగాక, సిద్ధులగు దేవతల ప్రీతికొఱకునుగాక, మన అంతర్యమున వెలయు ఏకైకసజీవదైవమును స్మరించి చేయుకర్మయని ప్రతిపాదించిరి. గీతాబోధయొక్క యుక్తియుక్తవాదము, ప్రాణమునైనను త్యాగముచేసి సాధింపనగు శాంతి పక్షమనుట నిశ్చయము. అయ్యాదియ మానవజాతియొక్క పరమనిష్ఠ.

గుహావాసము :

ఏనాటేని హిమాలయపర్వత గుహాయందు నేను భగవద్దర్శనముచేసికొనగల్గుదునని, నాకు నమ్మకము గలుగునెడల

తత్క్షణము నేనచ్చటికి పోయి యుందును. కాని మాధవుని మానవసమాజమునుండి వేఱుచేసి దర్శింపజాలనని నేను ఎఱుగుదును.

గోవధ:

ముసల్మానుడొకడు ఒక ఆవును చంపునప్పుడు మన క్రోధము తీవ్రమగుచున్నది. కాని యింగ్లీషువారికొఱకు అనుదినము జరుగుచున్న గోవధనుగూర్చి మనము నోరెత్తుట లేదు.

గోరక్షణ మనతో ముందుగ ప్రారంభము కావలయును. బండ్లు (నాగళ్ళు) తోలు హిందువులు బక్క-చిక్కి తూలిపోవుచున్న యెడ్లను ములుకోలలతో పొడుచుచుండుట చూచినప్పుడెల్ల నేను దుఃఖపడుచుందును. హిందువులు అమ్మివేయుకారణమున ఎన్నియోగోవులు కసాయివాని కత్తికి ఎఱయగుచున్నవి.

గోరక్షణకై మనకుగల ఏకైకమార్గము, పటుతరమైన ఉపాయము, ముసల్మానులతో సఖ్యతనెఱపి, వారి ప్రేమను సంపాదించుకొని, గోరక్షణను వారికి మనయెడగలుగు సోదర భావమునకు విడిచివేయుటే. అప్పుడు గోవధ హిందువులకు ఎట్లో ముసల్మానులకును అట్లే బాధాకరము కాగలదు.

అదృశ్యములై పోవుచున్న మేతబీళ్లను రక్షించుట, పేదగొల్లలు కసాయివారికి అమ్ముగోవులను కొనుగోలుచేసి పోషించుట, గోరక్షణశాలలను నెలకొలుపుట, శ్రేష్ఠమగు గోసంతతిని వృద్ధిచేయుట మొదలగు ధర్మముల నుపేక్షించి హిందువులు ఘోరపాపము చేయుచున్నారు. ముసల్మానుల

చేతులలో చచ్చు ఆవుల గాపాడకున్నను పాపమురాదు గాని, తాము గోజాతియెడ క్రూరముగ వర్తించుచు, నానిరక్షణ నెపమున ముసల్మానులతో పోరాడి నరహత్యలకు పాల్పడుట వలన అనంతముగా పాపమును సంపాదించుకొనుచున్నారు.

గ్రామ స్వ రా జ్యము :

గ్రామస్వరాజ్య విధానమున మానవ శ్రమకు అవకాశమును తొలగించి, ఏకొలదిమంది చేతులలోనో అధికారమును హెచ్చుగ కేంద్రీకృతము చేసిపెట్టు యంత్ర జాలమునకు తావుండదు.

గ్రామస్వరాజ్యమన ఒకపరిపూర్ణ ప్రజాస్వాతంత్ర్య పాలనము. ప్రతిగ్రామము తనకుకావలసిన జీవితావసరములకై పొరుగువారిమీద సయితము ఆధారపడక, తదితరములగు చాలవిషయములందు అన్యోన్యాధారము నంగీకరించుచు వర్తించును.

ఘో ర కృ త్య ము లు :

నేడు హత్యలు, దోపిడులు, గృహదహనములు ఘోరాతిఘోరముగా జరుగుచుండుట వాస్తవమే. గడచిన ముప్పది యేండ్లుగా నా నాయకత్వముక్రింద సాధనము చేయగల్గినది కేవలము సత్యాగ్రహముకన్న మెరుగైనది ఏమియుకాదు. కావున నేటి దౌర్భాగ్య పరిస్థితులయెడ గల బాధ్యతలో నావంతు నేను అంగీకరించెదను. మానవహృదయ పరివర్తనము కల్పించుటలో, కేవల సత్యాగ్రహము అహింసయంతటి శక్తివంతమైనది కాజాలదు.

ఘోషా :

పాతివ్రత్యమనునది ఒకమూల మూసిపెట్టి, పొదుగ దగినదికాదు. ఒరులుతెచ్చి పైబడవేయునదియుకాదు. చుట్టునుఘోషాగోడకట్టి పోషింపదగినదియుకాదు. . పురుషుల కనుచూపులకే తాళజాలని శీలము కడుతుచ్ఛమైనది... స్త్రీ జనోద్ధరణోద్యమమును చేపట్టుకొనుటకు నిర్మలాత్ములును, స్థిర చిత్తలును, ఆత్మనిగ్రహశీలలను, సీత, దమయంతి, ద్రౌపది వంటి నారీరత్నములను మనము సిద్ధముచేయవలయును.

చావు :

ఎవడో ఒకడు చావకుండ, ఎవడో ఒకడు పుట్టకుండ గడచు ఒక్కక్షణకాలమైన నుండదు. జననమరణములు నిరంతరము శాశ్వతకాలము జరుగుచునే యుండును. ఆత్మ ఎన్నడును పుట్టదు, చావదు. శరీరమునకు చావు పుట్టుకలు తప్పవు. ఒకని జననమనిన సంతోషము, మరొకని మరణ మనిన దుఃఖము పొందుట అవివేకమనక తప్పదు.

చావనునది యెట్టి సమయమందైనను ఒక వరప్రసా దమే. ఎవడు తానుపూనిన ధర్మముకొఱకై మరణించునో, అతడు ముమ్మాటికిని ధన్యుడు. మృతియన భయంకర పిశా చముకాదు. మిత్రములలోనెల్ల సన్మిత్రమనదగును. మరణ మన పునర్జన్మకారి. అది ప్రకృతి సహజోద్యమ క్రమమున, ఎప్పుడు తటస్థించినను మరణమునుగూర్చిన తలంపే యెంతయో ఉత్సాహప్రేరకము కాగలదు.

చేత :

యదార్థమునకు, నా వ్రాతలన్నిటిని నాశరీరముతో పాటు దహనముచేయదగును. నాచేతయే నిలిచియుండ గలదు; నేనేమి పలికితినో, నేనేమి వ్రాసితినో అవినిత్యములు కావు. హింసామాత సారమునంతను తెలుపుటకు ఈశోపని షత్తునందలి ఒక్కమంత్రముచాలునని తలచుచుగ నే నిటీవల చెప్పుచుంటిని. ఆ ఒక్కమంత్రము సయితము, దానిని అనువ ర్తించువాడు లేనియెడల, ప్రయోజనమేముండ గలదు? మన అర్హతయొక్క గణనకు మనమాటలు ఆధారము కాదగదు. కేవలము మన చేతలననుసరించియే మనయోగ్యత గణనకు రావలసియుండును.

జంతువధ :

మాంసాహారి జిహ్వకు దాసుడై జంతుహత్యా దోష మునుగనలేకున్నాడు. సకలజంతువులు జీవించుటకు నరుని తోడి సమానాధికారము కలవియే. శాస్త్రపరిశోధనకగు జంతు వధయు నేను సహింపనోపను. దానివలన గల్గుప్రయోజనము నకు గణన చేయదగినంత గరిమలేదు.

జంతుబలి మానినపిమ్మట భారతీయులు శూరత్వముం గోల్పోయిరను వాదము సత్యదూరము. జంతువధ అత్యధిక ముగ నున్నదేశములవారు ఘాతుక కార్యములన కొందఱు ఏవగించుకొనక పోయినను, శూరులగుదురనుటకు నిదర్శనము గలుగలేదు.

జన్మకర్మలు :

నే నీజన్మలో మోక్షమును పడయనోడితినేని, మరు జన్మలో పాకివాడనై పుట్టుదునుగాకయనుట నాహృదయ పూర్వకప్రార్థన... జన్మకర్మల రెంటిననుసరించియు వర్ణాశ్రమ ధర్మము లేర్పడునని నావిశ్వాసము. ఐనను పాకివాని కులము హీనమైన దనుటను నే నొల్లను. పరమ పూజ్యులగు పాకి వాండ్రను నే నెఱుగుదును. అందుకు మారుగా ఏమాత్ర మును గౌరవింప నర్హులయ్యును బ్రాహ్మణులనబరగువారిని నేనెఱుగుదును. నాకింకొకజన్మ విధింపబడియుండెనేని, మాల వాండ్ర మధ్య మాలవాడనై పుట్టి, వారి కింకను సేవచేయుదు గాకయని కోరుచున్నాను.

జపమాల :

జపమాలకు మారుగా రాటమును త్రిప్పుడని నేను ఎల్లఱకును ఎన్నడును బోధించి యుండలేదు. మఱేమన భగ వన్నామ జపముచేయునప్పుడు రాటమును సయితము త్రిప్ప నగునని సూచించితిని.

జపము :

రామనామ జపము గావింపుచు రావణునివలె వర్తిం చుచో అది నిష్ఫలము; అది కేవలము మోసము. ఎవడైనను తనను తాను మోసగించుకొన గలడు; ప్రపంచమును మోస గింప వచ్చును. కాని అంతరంగము నందలి సర్వేశ్వరుని మోసగింప జాలడు. రామనామమును పెదవులతో ఉచ్చ రించినంత మాత్రాన సత్ఫలము కలుగుననుట కల్ల. కాముని

భ్రాంతుల ననుసరింపుచు, రాముని దర్శనముయొక్క-ప్రాప్తిని ఆశించుట వ్యర్థము. ప్రపంచమును నడుపునది దైవము. చేతల ఫలము ననుభవించునది మనము.

జ ప నీ మ ము :

రామనామము కొన్ని నియమములకు, శిక్షణకు బద్ధమై యుండును. ఎవరయినను మితిమీఱి తిని 'రామ రామ' అని ఉచ్చరించినప్పటికిని పుట్టిన కడుపునొప్పి ఉపశమింపదు. రామనామమువలన సద్వినియోగములు చాలగలవు. నామకః రామనామ జపము చేయుచు దొంగతనముచేయు నరుడు మోక్షమందగలనని ఆశించినచో లాభముండదు. ఆత్మ వికాసము కొఱకు రామనామజపనియమములకు బద్ధులు కావలయును. అట్టివారికి రామనామము కామధేనువువంటిది.

జా తీ య సే వ :

స్వజాతి సేవకై పాటుపడవలయును; లేదా చావ వలయును.

జి హ్వా :

రుచుల దెలుపు జిహ్వేంద్రియమును తప్పక వశము చేసికోవలయును. రుచుల వాపిరితనమును అడంచలేనివాడు, పశుకామవాంఛను నిగ్రహింప జాలడనుట నా స్వానుభవము లోని విషయము. జిహ్వపై విజయముసాధించుట చులకనైన పనికాదు. కామ విజయము జిహ్వాయొక్క- నిగ్రహముతో ముడిబెట్టబడి యున్నది. జిహ్వాచాపల్యము నడంచు నుపాయ ములలో ముఖ్యమగునది మసాలా ద్రవ్యములను మిఠాయీ

లను పూర్తిగ కాకున్నను సాధ్యమగునంత వఱకును త్యాజ్యములుగ పాటించుట. మనము రుచి కొఱకుగాక, శరీరమును నిలుపుకొను కొఱకు మాత్రమే భుజింపవలయు ననెడు భావమును సర్వదా అలవఱచుకొనుట మఱొక సమర్థమగు ఉపాయమగును. మనము శ్వాస పీల్చుకొనుట బ్రతుకుకొఱకుగాని రుచి కొరకు గాదే! దప్పి దీర్చుకొను నిమిత్తమే నీరు ద్రావునటులనే, ఆకలి బాధను నివారించుకొను నిమిత్తమే ఆహారమును తినవలసి యుండును.

దురదృష్టవశాత్తు మన తల్లిదండ్రులు మన పసితనము నుండియు ఇందుకు విరుద్ధమగు అలవాటునకు పాల్పడ చేయుచున్నారు. వారు మన పోషణ కొఱకుగాక, వెఱ్ఱి ప్రేమచేత నానా విధములగు రుచ్యపదార్థములను పెట్టి మనను భ్రష్టుల జేసివేయుచున్నారు. ఈ అపకారకర గృహవాతావరణమును తప్పించుకొఱకై మనము పోరు సాగింపవలసివచ్చినది.

జమీందారు:

నేను జమీందారులను నాశము చేయ కోరువాడను కాను. మఱియు జమీందారులు అనివార్యముగ నుండి తీరవలసిన వారనువాడను కాను. పెట్టుబడిసాహుకారునెట్లో, అట్లే జమీందారునికూడ ఉపయోగకారునిగ, అహింసా సాధనముతో పరివర్తనముచేయకోరుదును. సేద్యముసాగించు. వారు తమశక్తిని గుర్తించుటయే జమీందారుని బాధకు విరుగుడు. వారుఏకీభవించి, ప్రశాంతముగాజమీందారునితో, మాకు కూడు, గుడ్డ, నిలువనీడ, మాబిడ్డలకు ఉచితవిద్యఏర్పర

చిన్నప్పు డేమైన నెకొంటకు భూమిని మన్నము అని చెప్పకొల్లు నెలల పర్యాయము చక్కబెట్టలేరు.

జీతాలు:

పై తరగతి ఉద్యోగులకు క్రింది తరగతి ఉద్యోగులకు, ధనికులకు పేదలకు మధ్య చూపట్టు విపరీతపు తారతమ్య సమస్య, తీవ్రమైన గాఢతర పర్యాలోచన ప్రాధాన్యకముగ నిర్ధారణ కావలసినదిగ నున్నది. ఏకొలదిమంది మంత్రుల యొక్కయు, వారి కార్యదర్శులయొక్కయు జీతాల తగ్గింపుతో మాత్రమే ఈ సమస్య పరిష్కారముకాదు.

ఆయా శాసన సభ్యులు తీసికొను జీతాలును, తదితర మున్నగు కర్చులును, వారు దేశమునకు చేయు సేవతో పోల్చి చూచునెడ చాల అధికముగ నున్నవని నా అభిప్రాయము. వారి ప్రయాణములు ప్రపంచములోనికెల్ల బీదదగు భారత దేశమునకు తగినట్లుగా లేవు.

భారత దేశమున మంత్రులును, శాసనసభ్యులును ఆయా సభల అనుమతి తీసికొని, తమ జీతాలను తమ అవసరములకు అనుగుణ్యముగా నియమించుకోవలయును. ఇది వెంటనే సాధ్యపడని పక్షమున అంతరాత్మ సాక్షిగా తమకుటుంబము లకు న్యాయముగ అవసరమగునంత కర్చుపెట్టుకొని, తమ ఉద్యోగ సేవలలోను కర్చుకాగా మిగిలిన సొమ్మును నిర్మాణ కార్యక్రమములో ఏదో యొక అంశముయొక్క నిర్వహణ ముకై వినియోగించవలయును. తమకవసరమగునంత

వఱకుతప్ప తమకువచ్చు సామ్మునంతను సొంతమునకే ఉప యోగించుకో వలయునను నిర్బంధముండదుగదా!

జీవితోద్దేశము:

సరళమగు జీవితమును గడపుట, సరళమగు సంకల్పము పూనుట, సరళమగు కర్మ నాచరించుటయే మన ప్రధాన జీవితోద్దేశము. మన సంకల్పముల నన్నిటిని దేహామువాలు చేయునెడల, ఆత్మ నీరసించి పోవును.

జ్ఞాపిక:

జ్ఞాపికయా? దేవునికి జ్ఞప్తి చేయ నవసరముండదు. అతడు ప్రతివాని అంతర్యామునను గలడు. వాని అనుజ్ఞ లేక యేమియు జరుగదు. మన ప్రార్థనలు మన హృదయ పరిశోధన కొఱకే. దైవ సహాయములేక మనము నిరర్థకులమగుదు మనుచు మనకు మనము జ్ఞప్తిచేసికొనుటయే ప్రార్థన. అట్టి ప్రార్థన లేనిది, దేవుని దీవనయొక్క అండ లేనిది మానవుని శ్రేష్ఠతమ ప్రయత్నము సయితము వ్యర్థమని చక్కగ గుర్తునుంచుకొననిది, ఏ యత్నమును పూర్ణతగాంచజాలదు. ప్రార్థన యనగా మానవజాతి కొక హెచ్చరిక. ఆత్మ పారిశుద్ధ్యము, హృదయ పరిశోధనము అవసరమనెడు హెచ్చరికయే ప్రార్థన.

తపస్సు:

తపస్సు సత్యాన్వేషణమునందు ఇమిడియున్నది. తపస్సనగా ఆత్మనిగ్రహము. దానియందు స్వార్థపరతకు తావు లేదు. నిస్స్వార్థ సత్యాన్వేషణమున నెవడును చిరకాలము

క్రోధముతో పోరాడలేము. క్రోధమునకు గురియైన వ్యక్తిని చూడ్చిచేసిన క్రోధమును నిగ్రహించుకొనవలెను.

తనతప్పును గ్రహించుటయే దానిని మరల చేయకుండుట కగునిశ్చయమే. అదియే తపస్సనగా. పాము కుబుసమును విడిచివేయునట్లు నరుడు తన దోషపుతలపాటులను విడిచివేయవలయును. అట్టి ఆత్మప్రాయశ్చిత్తమే పూర్ణతపశ్చర్యమగును.

సదా దుష్టసంకల్పములు చేయుచుండువాడు దుష్టకార్యములు చేయువానికంటె యోగ్యతయుండుకాడు.

## తప్పులు :

నాలో ఆడంబరములేదు. ఇతర మానవుల వలెనే నేనును తప్పులు చేయువాడనే. కాని నాతప్పులను ఒప్పుకొని, వెనుకకు నడుచుటకు తగినంత నమ్రభావము నాకుకలదు.

తప్పులుచేయుట మానవ స్వభావము. తెలిసిన పిమ్మట తప్పును దిద్దుకొని, మరల ఆ తప్పును చేయకుండ నిశ్చయించుకొనుట సజ్జన లక్షణము.

## దానము :

కటికి దారిద్ర్యమును, నిరుద్యోగదశయు బిచ్చగాండ్ర సంఖ్యను పెంచుచున్నది. నిరాశాహతులగువారి ఆత్మగౌరవమును భగ్నముచేసి, పారమార్థికముగ ఋణగ్రస్తులజేసి తిరిపెమిడుట పుణ్యప్రదము కాజాలదు. ధర్మ జీవనమును, అర్థావృత్తిని జూపి, వారి పాటు నొకింత ఆధారము చేసికొని, దానములు చేయుము; ఉద్ధరించుము.

దుష్టు :

దుష్టును పూజించువాడు దేవునిపూజను మానుకొనును.

దురాశ :

సత్యాగ్రహదినములలో జైళ్లకు పోయినవారికి ఇప్పుడు ఉన్నత పదవులను పొందుటకు తమకే హక్కుగలదని భావించు... మనస్థితి చాలనింద్యము. అందువలన కాంగ్రెసు ప్రతిష్ఠ మట్టిపాలగును. కాంగ్రెసువంటి సంస్థ ముఖ్యముగా ప్రజాసేవకై యేర్పడినది.

దూషణ :

దూషణను సహనముతో నెదుర్కొన వలయును. తన దూషణకు పాటి లేదని తెలిసినవాడు త్వరలో అలసిపోయి నోరుమూయును.

చెవులు, కన్నులు, నోరుమూసికొనిన కోతులబొమ్మ, దోషమును వినకు, దోషమును చూడకు, దోషమును పలుకకుమని లోకమునకు చాటి చెప్పుచున్నది.

ప్రపంచములో కర్మలందన్నిటను దోషముండును. దానిని కనిష్ఠమితికి తగ్గించుట మానవ ధర్మము.

దేవళము :

నరుని ఆత్మ విశ్వాత్మయందలి, అనగా భగవంతుని యందలి యొక అంశమే. ఈ సంబంధమును గ్రహించు నిమిత్తముగా శరీరము వినియోగపడు నెడల అది దేవళమగును.

**దేశము :**

నేను భారతదేశ స్వాతంత్ర్యము కొఱకై పాటుపడు చున్నాను. ఐనను ఆ నా దేశాభిమానము అన్యులకు నెట్టి హాని చేయునది కాదు. అది యే యితర జాతికిని అపాయహేతువు కాక పోవుటే కాక యథార్థముగా సర్వజాతులకు మేలుకూర్చు ఉత్తమ సూత్రమగును.

**దేశాభిమానము :**

నా దేశాభిమానము బహిష్కరణ స్వభావముకలది కాదు. అది యే దేశమునకును అపకారము చేయబోకుండుటే గాక, ఎల్లరకును మేలుకోరునది కూడను... భారత దేశ క్షేమలాభముల కొరకు, ఇంగ్లాండునకుగాని, జర్మనీకిగాని, మఱే దేశమునకుగాని నేను అపకారము కోరనొల్లను.

మనము కాలగతికి తలయొగ్గువారమై పోయినాము. నిరంతరము పరుల యుత్తరువులనే అనువర్తించు దాసులుగ సిద్ధము చేయబడినారము. స్వాభినివేశము సున్న. దేశాభిమాన మన్నను, సేవాప్రణమన్నను మన మెఱుగము. నేను, నా కుటుంబము అను ఆవరణములదాటి మన దృష్టి ప్రసరించుట లేదు.

**ద్వేషము :**

భగవంతుని యందును, భగవంతుని ధర్మనిరతియందును అనగా భగవంతుని కృపయందును ఏమాత్రము విశ్వాసము గల జనుడైనను తోడినరుల ద్వేషింపనేరడు. కాని, అట్టి వాడు వారి దోషముల మాత్రము సహింప జనడు.

తనలో హెచ్చుగ దోషమునిడుకొని ఈశ్వరకృప నపేక్షించు నతడు ఎవరిలో తనకు దోషములు గాన్పించునో వారిని అసహ్యించుకో దగదు.

దైవ నిర్ణయము:

సర్వేశ్వరుడనగా మనను బోలిన యొకపురుషుడుగాదు. ఆయన అనవలయునో, అదిఅనవలయునో తెలియదు. దైవ మనగా ప్రపంచమునగల మహత్తర చేతనశక్తి, లేక ధర్మము అనదగును. అందువలన ఆదైవము చంచల చిత్తముతో వర్తించుననుకొనరాదు. ధర్మమునకు మార్పుండదు; పరిణామ ముండదు. అది నిర్వికారమైనది... ప్రారబ్ధ సిద్ధాంతమునుబట్టి జబ్బు పడుదుమనుకొనినను, పరితాపము పడవలదనుట దీని పర్యవసానము కాజాలదు. జబ్బుపడుటకంటె, జబ్బుపడి నిర్లక్ష్యము చేయుట హెచ్చు దోషమగును. ఆరోగ్యవంతుల మగుటకు చేయు ప్రయత్నమునకు అంతుండరాదు. ఆరోగ్యమే ప్రకృతి ధర్మము.

దైవశాసనము:

అదృష్టవశమున జగదీశచంద్రబోసుగారి పరిశోధన వలన మనము జడద్రవ్యమనునది సయితము సచేతనమేనని రుజువు చేయనైనది. కావున చేతనముల నెల్ల పాలించు అల ధర్మమే దైవము. ఆ ధర్మశాసనమును, ఆ ధర్మశాసన కర్తయు ఒక్కటియే. ఆ ధర్మశాసనమునుగురించిగాని, ఆ ధర్మశాసనకర్తనుగూర్చిగాని నా కంతగా తెలియని కారణముచేత నేనాధర్మశాసనమునుగాని, ఆ ధర్మశాసన

కర్తనుగాని నాస్తి అనవీలులేదు. ఎట్లన పుడమిని రాజ్య పాలకుని యునికినిగూర్చిన నా అజ్ఞానముగాని, అట్టివాడు లేడను నా వాదనగాని నిష్ప్రయోజనమగు తీరుననే, దైవమును, దైవశాసనమును నేనొప్పుకొననందువలన వానినుండి తప్పించుకొను తెన్ను పొసగబోదు. రాజాధిపత్యమును నేను గుర్తించి వర్తించుటవలన నా వ్యావహారిక జీవనము సుఖకరమగు తెరగున, జగదీశ్వరుని పాలనమును తిరస్కరింపకుండ నమ్రతతో తలయొగ్గి వర్తించుటచే, నా జీవయాత్ర యంతయు సుఖకరమగును.

**దైవశక్తి:**

సర్వవ్యాపకమై పఱగుచు ఇట్టిది, అట్టిది యని వర్ణింపనలవిగాని విచిత్ర 'దైవీశక్తి' కలదు. దానిని నేను చూడజాలకున్నను, అనుభూతి చేయుచునేయున్నాను. ఈ అదృశ్యశక్తి తనకు తానె అనుభూతికి వచ్చుచున్నది. ఐనను ఋజువు చేయ శక్యముగాకున్నది.

**దోపిడి:**

బందుపోటు దొంగ ధనికుని దోచును. వర్తకుడో దరిద్రుని దోచును.

**దౌర్జన్యరాహిత్యము:**

హిందూమతము దీనత్వమునకును, ఇస్లాము మతము కాయకబలమునకును పర్యాయనామములైనవి. హిందువులు అహింసాబోధ గఱచినప్పటికిని, కాయకబలమును ఎదిర్చి నిలువవలసివచ్చినప్పుడు సాముదాయకముగా అహింసాబల

మును ప్రదర్శించి, దాని మహిమను ప్రకటించియుండవలెను. కాయకబలము ఎంతటిదిగా పైకొనివచ్చినను, దానినిమించి శ్రేష్ఠతరమై వెలయుట అహింసయొక్క మూలస్వత్వమని నేను సదా సమర్థింతును; వ్యక్తులవలెనే సంఘములును, ఇంతేల, లక్షలాదిగ గల సమూహములును ద్వాఙ్గన్యరాహిత్య మహిమను ఆచరించియందు ఋజువుచేయగల్గుదురని వక్కాణింతును.

క్షిప్తబలాధారమును, దైవబలాధారమును పూర్ణముగ పరస్పర విరుద్ధాంశములు సుడీ!

ధ న లో ప ము :

ధనలోపమువలన ఏ యుద్యమమును అంతరించిపోదు. నిష్కళంకులు, సమర్థులు, స్వార్థత్యాగులు నగు కార్యకరులు లేనిచో చెడిపోవును.

ధ ని క త్వ ము :

ధనికులమగు నేర్పు అనగా మనమట్టుకు మనము అధిక ధనమును కూర్చిపెట్టుకొనుటయేకాదు; మన పొరుగు వారిని మనకన్న తక్కువధనము కలవారిగా నుంచు నేర్పు నియు అర్థమగును. అనగా మనకు లాభకరమగు తీరున, అత్యధికమగు వ్యత్యాసమును (అసమానత్వమును) కల్పించు నేర్పని అర్థము.

ధనికులు, ధర్మకర్తలు :

ధనస్వాములు బుద్ధిపూర్వకముగ తమకడ నుండు సంపదకు ధర్మకర్తలుగ మారుటో, పేదలతోడి పోరాటములు

తెచ్చిపెట్టుకొనుటకో నిర్ణయించుకోవలసియున్నారు. వారు తమ సంపదలను వృద్ధిచేసికొనుటయు, వినియోగము చేసికొనుటయు అంగీకారమే. కాని, అట్లుచేయుట జాతియొక్క క్షేమలాభములకొరకు గావలయును గాని, కేవలము తమ కొఱకు గాదు.

ధన్యదినము :

ఏనాడు ఈ దేశమున ప్రతి వ్యక్తియు సంపూర్ణ స్వాతంత్ర్యమును పొందునో, ఏనాడు ప్రతి వ్యక్తికిని సమగ్రాభివృద్ధిని పొందు అవకాశము లభించునో, ఏనాడు అజ్ఞానము, దారిద్ర్యము, రోగబాధలు తొలగునో, ఏనాడు వట్టి ఉపన్యాసములందును, ఆడంబర ప్రచారములందును మాత్రము గోచరించుచు మానవసమాజమును పరస్పర విరోధికూటములుగ విభజించి, పోరాటములుకల్పించి, ఉద్రేకములను పుట్టించి ధ్వంసము చేయుటకు మారుగా, మన చర్యలలోను, మన ఆచారములలోను దృఢతరానురాగముతో మానవులందఱనుబంధించు సాధనముగా మతధర్మము పరిణమించునో, ఏనాడు దారుణమగు అస్పృశ్యతా దురాచారము మటుమాయమై, దుస్స్వప్నప్రాయమై చనునో, ఏనాడు నరుడు నరునిపీడించి పిప్పినిచేయు దోపిడిపద్ధతి నిర్మూలమై పోవునో, ఏనాడు అధమాధమ స్థితిలో బడియున్న ఆదివాసులకును, తక్కిన వెనుకబడియున్న దీనజనులకు తదితరులతోపాటు సమాన ప్రతిపత్తి చేకూరునో, ఏనాడు యీ కోట్లకొలది ప్రజలకు అన్నవస్త్రాదులు దొరకి, పాడిపంటలు

దేశమున సమృద్ధిగ దొరకునో, ఏనాడు ప్రజానీకమెల్ల నవ్వుచు, ఆడుచు, పాడుచు తమతమ ఉద్యోగముల సాగించు కొనుచుందురో, ఏనాడు ప్రతి కుటీరము హస్తపరిశ్రమ నిలయమై చెన్నారుచు దేశమును సుసంపన్నము గావించునో, ఏనాడు గ్రామసీమల బాలబాలికలెల్లరు సౌభాగ్యానందనములతో దివారాత్రములు ఉత్సాహవంతులై మనగల్గుదురో ఆ ధన్య దినము ఘటిల్లవలయునందులేని, ఎల్లరమును త్యాగములు చేయుటకు సంసిద్ధులమై ఈ శుభసమయమున దీక్షాబద్ధ కంక ణముల ధరింతముగాక.

ధర్మ :

నరుడు ధర్మ (దైవ) భీతిగలవాడై, తన హృదయ మునునిరంతరము పవిత్రవంతముగ నుంచుకొనుచు ప్రవర్తింప వలయును. మనుజుడు నిజముగా సాధకనాముడు కావలయు నన్నచో హిందువులు చెప్పుకొను తీరున 'ద్విజుడు' కావల యును. క్రైస్తవులు చెప్పుకొను రీతిని 'పునర్జన్మ' నంద వలయును. (ఆత్మజ్ఞాన జన్మప్రధానము.)

ధర్మ చక్రము :

ముప్పదియైదుకోట్ల అంగబలము గల భారతవర్గము హంతకుని ఖడ్గమును చేబట్టనవసరములేదు. ఈటెలు, బల్లె ములు ఉపయోగించు పనియులేదు. విషాన్నములు తినిపించు అగత్యమును లేదు. అమోఘమైన సంకల్పబలముచేత ఈ మహా (ధర్మ) చక్రమును త్రిప్పగలదు. ఈ సాహాయ్య నిరా

కరణ చక్రమును ప్రయోగించి ధిక్కరించి నిలుచు సమర్థత యొక్కటే కావలసినది.

### ధర్మ నిర్ణయము :

సరిగ నర్థముచేసికొనని ధర్మసూత్రములు సరిగ జీర్ణము గాని ఆహారముకన్న హెచ్చు హానికరములు. ఆహారమగుచో శరీరమును మాత్రము బాధించును; దానికి నివారణోపాయ మును కలదు. ధర్మనిర్ణయమో ఆత్మకు హాని గూర్చును; మఱి దానిని నివారించు నుపాయముండదు.

### ధర్మావలంబనము :

ఒకానొక ప్రవర్తనవిధానము, తనకుగాని, పరులకుగాని తుదిని ఎట్టిఫలమునొసగునో ఏనరుడును ఎఱుగడు. కాని ఎయ్యది శ్రేయస్కరమగునో, అదెట్లుచేకూరగలదో తెలియ కున్నను, ధర్మమార్గావలంబనము మనకును, ఇతరులకునుగూడ తుదకు అత్యుత్తమ ఫలప్రదమగునని మనమందఱమును తెలిసి కొననగును.

### నగరములు :

గ్రామాలను నాశనముచేసినవి నగరాలె. నగరము లందలి సౌధముల నిర్మాణమునకు గ్రామవాసుల రక్తమే 'సిమెంటు'. ఈ నాడు నగరముల రక్తనాళములలో ప్రవ హించుచున్న రక్తము మరల గ్రామముల రక్తనాళము లలో ప్రవహించుగాకయని నాకోరిక...

ఐనను నగరవాసులనెల్ల తొలగి గ్రామములకు మరలు డని పంపివేయను. నేను కోరునదెల్ల యిది. వీరు గ్రామీణు

లను కోల్పోకుండుట కాదు, తాము నాశము గావించియున్న గ్రామవాసుల ఆర్థిక సౌభాగ్యమును పునర్నిర్మాణము గావించుటకు వీలగుపద్ధతిని నగరవాసులికనైన తమ జీవితముల మార్పు జేయుదురుగాక!

నాస్తికుడు :

మనము ప్రేమసూత్రమును అనుసరించువారమగు నెడల నాస్తికుడగు సోదరునియెడల సయితము ద్వేషమును పూనజనదు. వానిని ప్రేమింపవలయును. మనము సమానముతో ప్రయత్నించితిమేని వాని పొరబాటును వానికి వివరించి, తెలిపి మనభావమునకు త్రిప్పుకొన గలుగుదుము; లేదా అతడు మనను తనవైపునకు త్రిప్పుకొనగలడు; లేదా యిరు పక్షములవారమును పరస్పరము సమానభావముతో శాంతమున జీవింపగలుగుదుము.

బౌద్ధులు, జైనులు నాస్తికులనిగాని, అజ్ఞేయ వాదులనిగాని నేనొప్పుకొనను. శరీరముతో సంబంధములేకుండగను, శరీరనాశనానంతరమునూ, నిలునగల స్వతంత్రమగు ఆత్మకలదని నమ్మువారు నాస్తికులు కానేకారు.

నిరాశ లేదు :

నేను భగవంతుని నమ్మువాడను గాన, నానియందలి విశ్వాసమును ఒక్కక్షణమైనను పోవిడువను గాన, అతడు నాకై యిచ్చగించు సుఖదుఃఖముల నంద తృప్తి జెందుదు గానను, నేను దుర్బలత నొకప్పుడనుభూతము చేసిననుకూడ, ఎన్నడును నిరాశంజెందబోను.

నీతిపరత్వము :

అక్రమ మార్గమున ధనార్జనమొనర్చు వర్తకుని కంటెను, న్యాయవాదికంటెను, వైద్యునికంటెను, నిరక్షర కుక్షియగు కార్మికుడు హెచ్చు నీతిమంతుడు కాగలడు.

నూలు :

మీలో ప్రతిస్త్రీయు తీరికచిక్కినపుడెల్ల నూలువడక వలయును. బాలురు, బాలికలు, పురుషులునుకూడ నూలు వడకవలయును... రెండువందల సంవత్సరములకు పూర్వము భారతస్త్రీలు స్వదేశమునకు కావలసిన నూలును మాత్రమే గాక విదేశములకు బంపుటకు కూడా వడకియుండిరి. ముతక నూలు నేగాక ప్రపంచములోనికెల్ల సన్ననినూలును వడికిరి. మన పూర్వులు వడికిన నూలువంటిదానిని వడుకుట కింకను ఏయంత్రమును సమర్థమైయుండలేదు.

న్యాయము :

హింసయొక్క ఆధారముచేత సాధించుకొనిన న్యాయము అన్యాయమునే కళంకితముచేయును. న్యాయము లేకుండ శాంతిని సంపాదించుట దుస్సాధ్యము.

శాంతియుతమగు ప్రపంచము న్యాయపూరితమై యుండును. న్యాయముతోడ నొప్పు ప్రపంచము శాంతితో నిండియుండును.

అర్థశాస్త్రములోనికెల్ల, అర్థశాస్త్రము న్యాయ శాస్త్రమే. ప్రజలు న్యాయముగ వర్తించి నీతిమంతులై యుండునంతవరకు సుఖవంతులుగ నుందురు. తద్భిన్నమగున

దంతయు వ్యర్థమగుటేగాక, సరాసరి వినాశమునకు దారి దీయును.

పట్టణవాసి స్వార్థము :

భారతమాత తన యేడులక్షల గ్రామములందు దర్శన మిచ్చును గాని, కొలదిపాటి తన పట్టణములందును, నగరము లందును దర్శనీయకాదు... పట్టణవాసి సాధారణముగా తన స్వార్థమునకై పల్లెలను వినియోగించుకొనుచున్నాడు. ఇంతే ల ? పల్లెలందు పాటుపడువారి నోటికడనుండి తిండిని లాగు కొని తాను బ్రతుకుచున్నాడు.

ఇప్పుడు వారు కోల్పోయియున్న పరిశ్రమలను, కళను పునరుద్ధరణము చేసికొను ప్రోత్సాహము నొసగి వారుత్పత్తి చేయువానిని సత్వరము వినియోగము చేసికోగలమని బాసట యిచ్చుటతప్ప నగరనివాసికి తాను ప్రాయశ్చిత్తము చేసి కొను మార్గము వేఱలేదు.

పతితులకు నాశ :

నావంటివాడే మలిన సంకల్పముల తప్పించుకొన లేన ప్పుడు ఇతరులకేలాటి ఆశయు నుండబోదను వాదనకు దిగ నేల ? ఒకప్పుడు కామపరతంత్రుడై యుండిన గాంధీయే నేడు తనభార్యకు మిత్రుడై, సోదరుడై మెలగజాలగా, ఎట్టి సుంద రాంగియగు తరుణినైనను తన తోబుట్టువుగా, తన తనయగా చూడగలుగగా, ఎంతటినీచునకైనను, ఎంతటి పతితునకైనను ఆశలేకపోదని యేల వాదింపరాదు? అంతటి దుష్కామ

పూరితునైన భగవంతుడు కరుణజూపగా, ఇతరులకు వాని కరుణ కఱవై పోదు.

పరమాణుబాంబు :

ఇతరమగు ఏసాధనమువలనను చేకూరజాలనంతగా పరమాణుబాంబువలన అహింసచేకూరగలదని అమెరికా మిత్రులు వాదించుచున్నారు... ఒకడు కోరుకువచ్చునంతగా మిఠాయిని మెక్కి ఆవికారము తగ్గగానె, అత్యుత్సాహముతో తృప్తితీర మరల మిఠాయిని తినుట ప్రారంభించి మరల ఆవికారమునకే లోనగును.

పరమార్థము :

మనము బంగారమునకంటే భగవంతునకు హెచ్చుభక్తి చూపుదుమేని భాగ్యభోగ్యముల ఆడంబరమునుకన్న నీతికి నిలువబడుటలో నిర్భయమును హెచ్చుగ జూపునెడల, సైనిక బలగములతో ధనరాసుల సంపాదించి రక్షించుటకై ధీరత్వమును పూనుటకు మారుగా ధర్మభంగమున కోర్వక పోరి ప్రాణాల బలియిత్తుమా, మనజన్మలు ధన్యములగును.

తనహృదయమును, తనచేతులను ఉపేక్షచేసి, తన బుద్ధిని, తనమెదడును బలపరచుకొనువాడు వివేకహీనుడు.

కాయకష్టమకు దూరమగు బౌద్ధిక విద్య క్షుద్రము; పరాన్నభుక్కుల జేయును.

పరహింస :

తాము చేయు దుష్కార్యము ఇతరులను బాధింపదనుకొనినను, తమనుమాత్రమే బాధించుననుకొనినను, అదియేదో

విధముగ తోడిజీవులకు అపకారమును, తద్ద్వారమున హింసను కల్పించి తీరును.

పరిపాలన:

శాంతియుత పాలనము చేయుటకుమాత్రమే యగు నెడల, నిష్కపటముగా పూర్తినిరంకుశ పరిపాలన జరిగినప్పటి కంటె అత్యావశ్యముగ నుండును. నిరంకుశపాలనము ఏతరగతి వారి వోట్లమీదను ఆధారపడునది కాకపోవుటచేత, ఎల్లరి యెడల పక్షపాతము లేకుండనుండగలదు.

పరోపకారము:

సర్వజనులును సర్వజీవులకును సకల పరిస్థితులందును చేయగలుగునది. తన ఉన్నతాదర్శము పరోపకారమని తలంచు నతడు గొప్పనీతిపరుడగును.

ప్రకటనలు:

నేటి ప్రకటనలనిన నా కసహ్యము. వాని పోషణ మున వార్తాపత్రికల నడుపుట అవినీతిపని.

ప్రకృతి:

మహాదేవదేశాయి, రామకృష్ణ పరమహంస మున్నగు వారు అనుభవించిన వ్యాధులకు కారణము ప్రకృతి నియమముల లోపమనుటకంటె, వారు ప్రకృతినియమభంగ మొనరించిరనుట సమంజసముగా నుండును...నా వ్యాఖ్యానము రామకృష్ణపరమహంసాదుల ఔన్నత్యమును ఏ విధమునను కించపఱచునది కాదు.

**ప్రకృతి వైద్యము :**

రామనామము మినహా యితరమంతయు ప్రకృతి వైద్యమునకు భిన్నము...

సహజమైన పాంచభౌతిక చికిత్సలను అధిగమించి యే వైద్యుడు తన పెరటిలో పెరిగెడి లేక స్వయముగ పెంచెడి మూలికలను స్వార్థరహిత సేవాపరతంత్రతతో ధనమును కాంక్షించక వ్యాధుల నివారించుటకు వినియోగించునో, అట్టి వైద్యుడు మాత్రమే ప్రకృతి చికిత్సకుడనని చెప్పుకోనర్హుడు. అకుంఠిత విశ్వాసము, నిరవధిక భక్తిశ్రద్ధలు రామనామ ప్రభావమునకు మూల కందములు.

**ప్రచారము :**

సోషలిస్టులు, కమ్యూనిస్టులు ఆర్థిక సమత్వమును నెలకొలుపుటకు తాము నేడేమియు చేయరట. అందు కనుకూలించు ప్రచారమును మాత్రము సాగింతురట. రాజ్యాధికారము కైవశమైనప్పుడు బలాత్కారముగా సమత్వమును విధింతుమందురు. అందుమూలాన ప్రజలలో విద్వేషములు పుట్టి తమ కోరిక నెరవేరునని వారి విశ్వాసము.

నా పద్ధతి అది కాదు. రాజ్యాధికారము ప్రజల అభిమతమును పాలించుటకే. వారేమి చేయవలయునో విధించి, అటులచేయ బలాత్కరించుట తగదు.

ద్వేషమునకు మారుగా ప్రేమశక్తులను ప్రేరేపించి, ప్రజలను నా దృక్పథమునకు త్రిప్పుకొని, దాక్షిణ్య రహిత

ముగా నడిపి, ఆర్థిక సమత్వమును సాధింతును. ఆ పని నిమిత్తమై నేను పేదలలో పేదవానిగ నే నుండవలయును.

ప్రత్యక్షము :

భగవంతుడు భక్తునియొక్క అత్యల్ప చర్యలందు సైతము ప్రత్యక్షము కాగలడు. మన పంచేంద్రియముల ద్వారమున లభింపగల అనుభవములను మించి, దృఢతరమును, సుస్పష్టములునైన ప్రత్యక్షానుభవము ద్వారమున మాత్రమే అట్టి ప్రసన్నత సాధ్యము కాగలదు. మన కెంత సత్యములుగ కాన్పించినను, ఇంద్రియానుభవములు మిథ్యలును, మోహజనకములును కాగలవు; కాగలవనుటే కాదు తఱచుగా అవి అట్టివే యైయుండును... అంతరంగమునందు యథార్థమగు భగవత్సాక్షాత్కారమును అనుభూతి చేసిన వారియొక్క పూర్తిగ రూపాంతరమందిన శీలమువలనను, చర్యలవలనను తప్ప, బాహ్యగోచరమగు నిదర్శనములవలన ఆ అనుభూతి రుజువుపడునది కాదు.

ప్రభుత్వ విధి :

ప్రయోజనకరమగు కర్మచేయు ప్రతి కార్మికునకును తారతమ్యము లేకుండ చాలినంత కూలి దొరకితీరవలయును. అట్టివాని కుటుంబమునకును చాలినంత కూడు, గుడ్డ దొరకునటుల చూచుట దొరతనమువారి కనీస ధర్మమగును. ఈ మాత్రమునకు పూచీపడని ప్రభుత్వము ప్రభుత్వమే కాదు; అరాచకమే.

ప్ర యో జ న ము :

విద్యామందిరములు, కళాశాలలు అనినంతనే నిరస నము చూపు నటుడనుకాదు నేను. వానివలని ప్రయోజనము లేకపోలేదు. మనము వానిని దుర్వినియోగము చేయు చున్నాము. దుష్ప్రయోగములు చేసి, వానినే ప్రధానము లుగ పాటించుచున్నాము. ఉచిత జ్ఞానార్జనమునకు గల పెక్కు సాధనములలో అవి కొన్ని; సామాన్యములుగనవి కాగలవు.

పా కి స్థా న ము :

గాఢ విశ్వాసముతోడను, శాస్త్రజ్ఞతోడను, విషయ పరిజ్ఞానముతోడను, కాంగ్రెసువారు పాకిస్థాన నిర్ణయమునకు అంగీకరింపవలసినవారగుచున్నారు. వారీ తీర్మానమును త్రోసిపుచ్చినయెడల, దేశములో అంతఃకలహములు, అల్ల రులు, ప్రజ్వరిల్లననెడు గట్టినమ్మకము ఉండునేని, ఈతీర్మాన మును నిస్సంకోచముగా నిరాకరింపవచ్చును... ఇప్పుడంగీక రింపబడు పథకము ఏలాటిదైనను కానిండు; శ్రేష్ఠమైనది కాద నుట నొప్పుకోవలసినదే... హిందూ ముసల్మాను మతముల రెంటి పరీక్షార్థమైయే ఈపథకము వచ్చినది.

పా కీ ప ని :

పాకీవాండ్రు అశుద్ధపు తట్టలను మోసికొనిపోవుట చూచునప్పుడు ఏవగింపు పుట్టును. కాని పాకీపనిని ఒక కళ నుగా మార్చవచ్చును. మలమును తొలగించు విధానము, పనిముట్లు పరిశుభ్రముగ నుండవలయును. నేనుపయోగించు

మనసుగోడ్డి యేమాత్రము కంపమునదిలేక పరిశుభ్రముగ నుంచును. నేను స్వయముగ శుభ్రపరతును.

మసగుగొడ్డిచాయున గూర్చుండి పాకీవాండ్రను తింన్లు తిందురు. ఆ దృశ్యము హృదయ విఛేదకముగ నుండును. వారికి అంతకన్న మాననీయమగు పనిని చూపగల్గుట మీకు అసాధ్యము కాదు.

నాదృష్టిలో పాకీవాడును బ్రాహ్మణుడును, నీతివిలువ యందు సమానులే. వృత్తిభేదము గౌరవభేదమునకు హేతువు కాదు.

బ్రాహ్మణుడు లేకున్నను జాతి బ్రతుకగల్గునుగాని, పాకీవాడు లేనిది బ్రతుకజాలదు.

మురికి గౌరవహీనముకాదు. బిడ్డయెడ పాకీపనిచేయు తల్లి పూజనీయకాదే?

తల్లి చేయునది శుద్ధిక్రియ; సమాజమునెడ ఆ శుద్ధి క్రియజేసి ఆరోగ్యమును సంరక్షించునతడు పాకీవాడు.

బ్రాహ్మణుడు సంఘముయొక్క ఆత్మను ఆరోగ్యమును గూర్చును; పాకీవాడు గాత్రమునకు ఆరోగ్యమును గూర్చును. గాత్రశుద్ధి ఆత్మశుద్ధికి ప్రథమ సాధనము. నేడిరువురును తమ ఆదర్శమునుండి పతితులైరి.

పాకీపనిని హీనముగనెంచి సంఘము పతనమైనది. సంఘము ఆయురారోగ్యభాగ్యభోగ్యములను, ముక్తిని, బడయనెంచుచో పాకీవాని నుద్ధరింప గావలయును.

శాస్త్రజ్ఞునకన్నను పాకీవానికి ఆరోగ్యశాస్త్రమును మిన్నగ గఱపవలయును.

పురీషమును అమృతముగ మార్చు విద్యను పాకీవానికి నేర్పవలయును.

పాఠశాల:

యోగ్యమగు గృహమునకు సాటిరాదగిన పాఠశాల లేదు. నీతిమంతులగు జననీ జనకులకు సములు కాగల ఉపాధ్యాయులు లేరు...

పాఠశాలలు:

మనపాఠశాలలు, కళాశాలలును మనను ధీరుల గావించుటకు మారుగా దీనులను, పిఱికిపందలను, కర్తవ్య విమూఢులను, నిరర్థకులను చేయుచున్నవి. ధీరత్వము దంభోక్తులలో లేదు; పురస్కారములలో లేదు; బెదరక ప్రతి దానికిని కాలుదువ్వుటలో లేదు. సాంఘిక కార్యములందు గాని, రాజకీయములందుగాని, మతసేవయందుగాని, ప్రతిఫలాశ లేకుండ, ధర్మానుసరణము చేయుటయందుండును. ధీరత్వము మాటలలోగాక చేతలలో ప్రకటనమగును. ఇది నా దృఢవిశ్వాసము.

పాపము:

'పాపమును ద్వేషించు; పాపిని ప్రేమించు' అను ధర్మ సూత్రము గ్రహించుట తేలికయేగాని, బహుఅరుదుగా అనుసరింపబడుచున్నది. అందుమూలాననే ప్రపంచములో విద్వేష విషము ఇంతగా వ్యాపించుచున్నది.

దాచిపెట్టిన పాపము సంఘదేహామునంతను దోష మయముచేయు విషమునంటిది. ఆ విషము ఎంతత్వరితముగ వెలిగ్రక్కివేయబడిన సమాజమున కంతమంచిది.

మన పాపములు ఏప్రాయశ్చిత్త చైదములును లేకుం డనే, కేవలము భగవంతుని నమ్ముకొనుటచేత కడిగివేయ బడుననుటకు, "నన్ను శరణువేడువాడెవడును నాశమందడు" అను భగవంతుని మాటలు ప్రమాణములనుట పొరపాటు. ఎవడు విషయప్రలోభములకు లొంగక పెనగులాడుచు కన్నీటి ధారలాలుగ పశ్చాత్తప్తుడై దైవమునకు అభిముఖముగ మరలునో, అతడుమాత్రమే కనికరింపబడుననుట నిశ్చయము.

పా రా య ణ ము లు :

కేవల యాంత్రికచర్యలు కానియెడల పఠనములు మహాసీయ ఫలితార్థముల నొసగగలవు. కావున జపమాల కేవల మూఢాచారమని నేనను. చంచలబుద్ధిని పవిత్రీ భూతముచేయుటకు అదొక యుపాయము. అనుదిన పారాయ ణములు మఱొకతరగతిలో చేరును. శ్రద్ధాళువగు ఆత్మాన్వే షికి తన జీవితసరళిని సరిదిద్దుట కేర్పడిన ఏకాదశవ్రతనియము లకు తాను బద్ధుడై యున్నటుల దెలుపు శ్లోకపారాయణము, అతడు నిద్రనుండి లేచునప్పుడును, నిదింపబోవునప్పుడును ప్రతిదినము వానికి హెచ్చరికగొలుపు సాధనముకాగలదు... దుర్బలాత్ములకు, చంచలమనస్కులకు ప్రమాణస్వీకార ములు, దుర్బలశరీరములకు బలవర్ధక లేహ్యములవలె నుపక రింపగలవు.

తప్పును గుర్తించుటన దానిని మరలచేయకుండు నిశ్చయనకు కాగలుగు నెడల, అయ్యది సమర్థమగు తపస్సే. అట్టినరుడు తన దురభ్యాసములను, పాము తనకుబుసములను రాల్చివేయునట్టుల, విసర్జించివేసి పవిత్రుడగును....

కాని మరలమరల దోషముల జేయుచుండు జనుడు వానినుండి పునీతుడు కాజాలడు.

## ప్రాణార్పణ :

తనప్రాణమును ఎప్పుడు ఎట్లు అర్పణచేయవలయునో యెఱుగనివానికి, బ్రతుకుట ఎట్లో తెలియనట్లే.

## ప్రార్థన :

ప్రార్థనమనగా దేనికొఱకును వేడుకొనుట కాదు. ప్రార్థనము ధర్మనిర్వహణమునకై సంసిద్ధపడు పూనికయే.

తనలోని ఆత్మశక్తిని ఫురిగొలుపగోరువాడు, ప్రార్థన చేయువాడే.

నేనేకార్యమును పూనుకొనినను ప్రార్థనచేయక ప్రారంభించుట లేదు.

దేవునికి నైవేద్యములు పెట్టి లాలింపజాలము. సత్ప్రవర్తన యొక్కటియే వానిని ప్రీతునిచేయు.

విశ్వవ్యాప్తమా ప్రేమ ప్రతి రామ (దైవ) భక్తునికిని అవసరము. హిందూమతముగాని, మహమ్మదీయమతముగాని చిరకాలము వర్ధిల్లుటకు ప్రేమసూత్రమే ఆధారము. అట్టి అఖండప్రేమ శూన్యమయ్యెనా హిందూమతముగాని, మహమ్మదీయమతముగాని వినాశమందకతీరదు.

నేను ఇంకను దేనిలో పూర్ణముగ విశ్వాసభూతిని పొందలేకయుంటినో, అట్టి నన్నుగుఱించియే, అనగా నాయొక్క సత్యాత్మను గుఱించియే, నాఅనల్ప స్వస్వరూపమును గుఱించియే నేను విన్నపము చేయుచుంటిని. సమస్త భూతములను తనయందు ధరించియుండు పరమేశ్వరునిలో లీనమగు కొఱకైన నిరంతరాకాంక్షయే ప్రార్థనమని మీఁదు అభివర్ణింపవచ్చును. ప్రార్థనమనగా నిజముగా తనలోని పూర్ణమగు ఆత్మయొక్క ధ్యానము.

ఘనులందును, బలాఢ్యులందునుకంటె, తనసృష్టి యందలి దీనులగువారియందే భగవంతుడు హెచ్చుగా ప్రత్యక్షమగుచుండునని నేనెఱుగుదును.

నాచేతగల ఘనతరాయుధము మౌనముగా నేనుచేయు ప్రార్థనయే.

ప్రార్థనము అనగా మన దుర్బలతను, మనలోపములను వెల్లడించుటె. భగవంతునకు అనంతమగు నామములు కలవు. అనవచ్చును; లేదా ఆయనకు పేరే లేదనవచ్చును. భగవంతుడు అంతరంగవాసి; సర్వశక్తి సంపన్నుడు ... మన అర్హతను అనుసరించి ఆయన ప్రసన్నత చూపుచుండును. ఆయనను ప్రార్థనచేయువాడు పెదవులతోగాక, హృదయముతో చేయవలయును. ఆహృదయమును నిర్మలముచేసికొనవలయును. అచంచల విశ్వాసము పూనవలయును. రాముడు హనుమానుని పెదవులమీఁద నుండువాడుకాడు. అతని నిర్మల హృదయమందలి సింహాసనమున అధివసించియుండును. తన

పీఠమునుంచుకొనుటకై తోడిమానవుల సేవనొనర్చువారి పవిత్ర హృదయములను, భగవంతుడు తానె వెదకి యేర్చుకొనును.

ప్రార్థనమనగా పెదవులతో చేయునట్టి ఉచ్చారణ కాదు. ప్రార్థనము అనగా అంతరంగమునుండి వచ్చుచు, ప్రతి మాటయందును, ప్రతిచేతయందును, ఇంతేల నరుని ప్రతి సంకల్పమునందును, ప్రకటితమగునట్టి హృదయావేదనయే... తమయందు అధివసించి భగవంతుడున్నాడను జ్ఞప్తితో నిండిన వారికి కర్మచేయుటయే ప్రార్థించుట యగును. వారి జీవితమే ఒకనిరంతరప్రార్థనము, లేక ఆరాధనమ్ము యగును.

మన నిస్సహాయతను గుర్తించి సర్వమును భగవంతుని మీాదనే విడిచి, వానిమీాదనే ఆధారపడి జీవింపవలసిన వారమని తెలిసికొనుటయొక్క ఫలితార్థమే ప్రార్థన....

మనము తోడిమానవులను సేవించుకొనుటకై పుట్టియున్నాము. మనము కడుజాగరూకులమై మెలగినగాని, ఆసేవను సక్రమముగా చేయజాలము. మనహృదయములో తిమిరశక్తులకును, ప్రకాశశక్తులకును సదా ఎడతెగని పోరాటము జరుగుచున్నది. ప్రార్థనమనెడు కవచమును ఒక్కక్షణము విడిచినవాడు తిమిరశక్తులచే హతుడై పోవును.

ప్రార్థన నా జీవరక్షగా నున్నది. అదిలేనియెడల చిరకాలము క్రిందటనే నేనొక వెఱ్ఱివాడనై పోయి యుందును. భగవంతునియందు నావిశ్వాసము పెరిగినకొలదిని ప్రార్థన కొఱకగు తీవ్రవాంఛ అడంపరానిదై వచ్చుచున్నది.

### వి గ్ర హా ర ము :

మతమనునది సంకుచితమైన పిడివాదము కాదు. బాహ్యకర్మకలాపమును గాదు. మతమనగా భగవంతుని యెడ అచంచలమగు విశ్వాసము. వాని సన్నిధానము యొక్క అనుభూతి; పునర్జన్మము కలదనెడు గట్టి నమ్మకము. సత్యమునందును, అహింసాధర్మమునందును అచంచల భక్తిగలిగిన వర్తనమే మతము.

కాని నిత్యజీవితచర్యలను సరకుగొనక వాని సమస్యాపరిష్కారమున దారిజూపని మతమును 'మతము' అనదగదు.

హేతువాదమునకు అంగీకృతము కానట్టియు, నీతి వర్తనమునకు విరుద్ధమగునట్టియు మతమున్న నేను తిరస్కరింతును.

### పు న ర్వి వా హ ము :

భార్యావియోగమైన పురుషునకు పునర్వివాహము నందెంత అర్హత కలదో, భర్తృవియోగమైన స్త్రీకి పునర్వివాహము నందంతటి అర్హత కలదని నే నెన్నిసారులో చెప్పియున్నాను. ఐచ్ఛిక వైధవ్యవ్రతమనునది హిందూమత మొసగిన వెలలేని వరప్రసాదము; నిర్బంధ వైధవ్యమును నదొక క్రూరశాసన మనవలెను. యథార్థమగు హిందూ వితంతువు అగణితమగు అదృష్టరాశియే యని నా భావము. రామాబాయి రణదేవువంటి వితంతువు అటువంటి అంతులేని వరాలరాశియే.

పురుషార్థము :

జీవుడు దేవుడుకాడు; కాని జీవుడు దేవుని తేజస్సు నుండి వేఱువస్తువు కాదు. ఎవనియందు తన యంశమునకు మించిన ధర్మతత్త్వజ్ఞానము కలదో అతడే ప్రముఖావతారము.

మనుష్యుడు భగవత్స్వరూపుడు కానంతవఱకు ఆత్మ శాంతిని బడయడు. నరుడు ఈశ్వరస్వరూపుడగుటకు చేయు ప్రయత్నమే పురుషార్థము.

ధర్మము, అర్థము పరస్పరము విరుద్ధవిషయములనియు, వాణిజ్యాది లౌకిక వ్యాపారములందు ధర్మమునకు స్థానము లేదనియు, ధర్మము కేవలము ముముక్షువుల కొఱకేర్పడినదనియు తలంచు భ్రాంతిని గీత నివారించుచున్నది.

గీతచెప్పు యజ్ఞమున హింసాసంబంధము ఇసుమంతైన లేదు. అందు జపయజ్ఞమే యజ్ఞములకు రాజని చెప్పబడినది. ముఖ్యముగ పరోపకారమునకై శరీరమును వినియోగపఱచుటయే యజ్ఞమున కర్థమని గీత మూడవ అధ్యాయము బోధించుచున్నది.

పూర్ణస్వార్పణము :

మనము పొందదగు యథార్థమగు స్వేచ్ఛకు పణముగా, సంపూర్ణ స్వార్పణమునకు కొదువపడు దేనిని దేవుడు కోరడు. అటుల నరుడు అహంకార శూన్యుడుకాగనే, తాను సకల జీవుల సేవయందు నిమగ్నుడైనట్లు తెలిసికొనును. ఆ సేవ వానికానందము గొలుపును; అయ్యది వానికి క్రీడాకార్యమగును. అతడొక నూతన పురుషుడగును. భగవంతుని

సృష్టిలోని ప్రాణులసేవయందు శ్రమించుటందెన్నడును అత
డలసట నందడు.

ప్రేమ :

దుండగీండ్ర మధ్యకు ఉరుకండి. వారి ఉన్మాదమును శమింపజేయు ప్రేమధారలను ఒలికించి సమ్మతిపఱుప యత్నించుడు. విఫలురైతిరా ప్రాణము లర్పింపుడు. మధ్య మాని వేసి వార్తలు తెలుపుటకైన తిరిగిరాకుడు.

సత్యమనగా ప్రేమ. అది అఖండమై పఱగును. మిత ప్రజ్ఞుడగు నరుడు దానిని ఎన్నడును సంపూర్ణముగా తెలిసికొనజాలడు. ఐనను మనకు దారిచూపుటకు చాలునంతవరకు అది మనకు తెలియుచునేయుండును. దాని ఆచరణయందు మనము పొరబడుచున్నాము. నరుడు స్వయంప్రభుతగల జీవి. తప్పులు చేయు అధికారమును, ఎన్నిసార్లు చేసిన అన్నిసారులు వానిని దిద్దుకొను అధికారమును వానికి గలదు. అదియే వాని ప్రభుత. ప్రతివాడును తుదిని తనకుతానె శాసకుడుగ నుండవలయును.

ప్రేమాభిమానములు :

కచ్చితముగా లెక్కగట్టవీలగు ఆవిరి, కొంతశక్తి లేక మనోబలమువలన నడుపబడు యంత్రమువంటివాడు కాదు నౌకరు. అతడు హృదయప్రేరణవలన నడుపబడు యంత్రము వంటివాడు.... ఈవిచిత్ర యంత్రమువలన డబ్బిచ్చిగాని, ఒత్తిడిచేసిగాని, అధికమగుపనిని చేయించుట సాధ్యపడదు. ప్రేమాభిమానమనెడు సక్రమమగు బొగ్గువేసి దానికి (మానవ

యంత్రమునకు) హృదయ ప్రేరణమను శక్తిని సమకూర్చి పెట్టిన మాత్రమే అటుల చేయింపనగును.

పొగత్రాగుట :

సకాలములో దానిఅనర్థము తెలియరాని కారణము చేత, పొగత్రాగుట కల్లుత్రాగుటకంటె తక్కువపాపమన రాదు. అది వినయవర్తనమును నాశము చేయుచున్నది. మాననీయమనెడు భ్రాంతిలో పడవేయుచున్నది. ఒక్కసారి దానికి వశుడైనవ్యక్తి, యిక తెప్పరిలజాలడు. నోటినుండి దుర్వాసన వెలువడును. పండ్లుచెడును. గుండెయు, ఊపిరితిత్తులును రోగగ్రస్తములగును. కొన్ని సందర్భములలో దానివలన క్షయవ్యాధి కలుగును. బీడీలు, సిగరెట్లు కాల్చుట సభ్యత యను భ్రమ సంఘము నావరించుచున్నది. అదెంతయు రోత చేటు.

పొగాకు మానవుని బుద్ధిని బండబారజేయునని టాల్‌స్టాయిగారు స్వానుభవమువలన చెప్పినమాట. బుద్ధి పూర్వకములగు ఘోరకార్యములనేకము పొగద్రావిన మత్తుచే కావింపబడెనని, నిదర్శనములను పెక్కింటిని ఆయన చూపి యున్నాడు.

బలము :

దార్ఢ్యము అనివార్యమని భావముకాదు. మాంసమయ శరీరముయొక్క భోగరాగములు తొలగుటతో, కండర బలముపైని వాంఛ సహజముగ తొలగిపోగలదు.

బ్రహ్మచర్య వ్రతస్థుడు రుచులకు లొంగక, జిహ్వను అదుపులో పెట్టుకొని, బ్రతుకుటకు తిననలయునే గాని, తినుటకు బ్రతుకరాదు.

## బహిష్కారము :

తనకు ఐహికముగగాని, ఆముష్మికముగగాని పతనమును గూర్చు విషయములనెల్ల నరుడు బహిష్కరింపవలయును.

బ్రిటిషువస్త్రబహిష్కారమునగాని, బ్రిటిషు వస్తు బహిష్కారమునగాని ద్వేషభావముండరాదు. విదేశీవస్త్రబహిష్కారమున స్వజాతీయుల వృత్తి రక్షణ నిమిడియున్నది. మిల్లు గుడ్డల బహిష్కరించుటయు అటువంటిధర్మమే.

యంత్రసిద్ధ వస్త్రబహిష్కరణకు మూలము ప్రేమ. సకలవిదేశీవస్తు బహిష్కరణకు మూలము ద్వేషమగును.

యంత్రసిద్ధ వస్త్రమును ధరించుటలో హస్తకర్మ పోషణ ధర్మము భంగపడుచున్నది; దానిని బహిష్కరించుటలో ధర్మరక్షణమున్నది.

కాంగ్రెసుకు బ్రిటిషువస్తు బహిష్కరణము తాత్కాలికము రాజకీయపుఎత్తు కానోపును. అందు దేశీయులవృత్తి పునరుద్ధరణాధర్మము లోపించినచో, అదియు ద్వేషభావముచే కలుషితమై పోగలదు.

## బ్రహ్మచర్యము :

బ్రహ్మచర్యము అనగా శబ్దార్థము భగవత్సాక్షాత్కారమునకు దారితీయు జీవనవిధానము అని. ఆ సాక్షాత్కారము

ఇంద్రియ నిగ్రహములేక సాధ్యపడదు. అన్ని ఇంద్రియముల నిగ్రహము అనగా (జీవ) ఆత్మ సంయమనము అన్నమాట.

బ్రహ్మచారికి విశేషము ఆహారమక్కఱ యుండదు. ఐనను చాల శరీరశ్రమ నోర్వగలడు. మానసిక శ్రమవలన అలసిపోడు. సామాన్యపు వృద్ధాప్య చిహ్నములు వానియందు కాన్పింపవు. అవసానకాలము వచ్చినప్పుడు పండుటాకు వలెనో, పక్వమైన ఫలమువలెనో, అనాయాసముగా, సర్వేంద్రియములపాటవముగల్గియే, దేహత్యాగముగావింపగలడు... వయసుమీరినకొలదిని వాని బుద్ధి, శక్తి వికసింపుచు శక్తి వంతమగుచుండును. బ్రహ్మచర్యమెన్నడును ఆరోగ్యభంగకరముకాదు; కేవల బాహ్యనిరోధము అటులకానగును.

బ్రహ్మచర్యమనగా వీర్యరక్షణమని సాధారణముగా అర్థముచేయుదురు. కాని వీర్యరక్షణమాత్రముచేత పూర్ణ బ్రహ్మచర్యసిద్ధిలభింపదు. బ్రహ్మసాక్షాత్కారము సిద్ధింపదు.

యథార్థమగు బ్రహ్మచర్యమనగా బ్రహ్మాన్వేషణమే. బ్రహ్మాన్వేషణము సర్వేంద్రియ నిగ్రహములేనిది ఫలింపదు. స్త్రీగాని, పురుషుడుగాని బ్రహ్మచర్యవ్రతముపూని సర్వవ్యసనములనుండి విముక్తిపొందవచ్చును.

మనసుచే, వాక్కుచే, కాయముచే పూర్ణ బ్రహ్మచర్య వ్రత పాలనముచేయుట నరునకు అసాధ్యముకాదని నాదృఢ విశ్వాసము.

బిచ్చము :

ఏదోయొక ధర్మమార్గాన కష్టపడి సంపాదనచేయని బిచ్చగానికి, ఉచితముగా ఆహారముపెట్టు ఆచారమును నా అహింసాధర్మము సహింపజాలదు.

నిర్విచారముగ బిచ్చముపెట్టు ఆచారము జాతికి పతనమును కూర్చినది. బద్ధకము, సోమరితనము, కపటవేషము మున్నగునానిని, దోషవృత్తిని సయితము పురికొల్పుచున్నది.

అపాత్రులకు దానముపేర బిచ్చములు పెట్టుటవలన దాతలకు ఐహికాముష్మికముగ పుణ్యము ఏమాత్రమురాదు.

నెత్తిగా బిచ్చమిడుటకంటె ఆరోగ్యవంతమగు పరిశుద్ధ వాతావరణముగలచోట కర్మశాలలు నెలకొల్పి, బిచ్చమెత్తు స్త్రీ పురుషులకు పనులు కల్పించి పోషించుటెంతయు ధర్మ సమ్మతమగు యోగ్యతర కార్యమగును.

భక్తి :

గాలిలేకపోయినను నేను జీవింపగలను గాని, భగవంతుడు లేకుండ జీవింపజాలనని నేను సాక్ష్యముగూడ నిచ్చుచున్నాను.

భగవంతునియందు నాకుగల విశ్వాసమును భంగపరచితిరా, నేను చచ్చినట్లే.

భక్తుడు :

భగవంతుని ప్రేమించు నతనికంటె, తోడిమానవుల ప్రేమించి సేవించుట ద్వారమున, దేవుని సేవించువారిని

దేవుడు ప్రేమించును. దేవునిచే ప్రేమింపబడగల అస్వాడే యథార్థమగు భక్తుడు.

## భగవంతుడు :

భగవంతుడు నరుని పోలువాడని నాభావముకాదు. నామట్టుకు నాకు సత్యమన భగవంతుడే. ఇహలోకమున పాలకుడును, వాని శాసనమును వేఱు వేఱైనట్టుల, భగవంతుడును, భగవంతుని శాసనమును (సత్యమును) భిన్నభిన్న వస్తువులుగాని, విషయములుగానికావు.

నావిషయమున భగవంతుడనగా సత్యమే, ప్రేమయే. భగవంతుడే నీతియు, ధర్మమును. భగవంతుడన నిర్భయత్వమే. భగవంతుడు ప్రాణవిజ్ఞానములకు మూలాధారము. ఐనను ఆయన వీని అన్నింటికిని అతీతముగ దూరమున నుండును.

భగవంతుడన అంతస్సాక్షియే. భగవంతుడు నాస్తికుని యొక్క నాస్తికతత్వమే అనవచ్చును. ఏలన, భగవంతుడు అపారప్రేమతో నాస్తికునిగూడ మననిచ్చుచున్నాడు.

## భగవద్విశ్వాసము :

ప్రతివానికిని భగవంతునియందు విశ్వాసము కలదు. కాని ప్రతివానికిని ఆ విషయము తెలియదు. ఎట్లన, ప్రతివానికిని తనయందు విశ్వాసము కలదు. దానిని అనంతముగా పెంచుచో, అదియే దైవము. సచేతనమగు సర్వముయొక్క మొత్తమే దేవుడు. మనము దైవముకాదు గాని మనము దైవాంశమే. మహాసముద్రమునందలి జలకణముల బోలి యున్నాము. ఒకకణమును సముద్రమునుండి వేఱుపఱచి,

కొన్ని ఆముకల హానము విసరి వేసితిమనుకొనును. అది తన పరిసరములనుండి విడివడి, నిస్సహాయ దశలో పడిపోవును. సముద్రముయొక్క ప్రభావమును, గాంభీర్యమును అనుభూతి చేయజాలదు. ఐనను ఎవరేని, అదిసముద్రముయొక్క అంశమే నని దానికి చూపగలుగునెడల, దాని విశ్వాసము పునరుద్ధృతమగును. అంతట ఆనందాతిశయముతో అది నృత్యము చేయగల్గును. మహాసముద్రముయొక్క మహిమయు, పూర్ణ సత్వమును దానియందు ప్రతిబింబింపగల్గును.

భగవంతుని ఉనికి:

ఏ ఆధిభౌతిక శక్తియొక్క యునికినిగుర్తించిన్నైనను నేనెఱుగకున్నను, లేక దానిని నేను లేదనినను ప్రయోజనము లేదుగదా? అదే విధమున భగవంతుని, భగవంతుని శాసనమును నేను గుర్తింపకున్నను, లేదని వాదించినను వాని శాసనము నుండి నన్నేదియు తప్పింపజాలదు.

శరీరమును నిర్జించిననే తప్ప భగవంతుని ముఖాముఖిని చూచుట సాధ్యపడదు. భగవంతుని ఆలయమను భావముతో శరీరమునకు సంబంధించిన కార్యములను నిర్వహించుట యొక విషయము; మాంసమయ శరీరముగ దానికి సంబంధించిన కార్యముల విసర్జించుట వేఱొక విషయము.

భగవంతుని ఓర్పు:

భగవంతుడు ఓరిమిగలవాడు. మిగుల క్షమ జూపును. అప్పుడప్పుడు హెచ్చరికల జూపుచు, వానిని సరకుగొనక క్రూరులు తమ వినాశమును తామె కూర్చుకొనుచున్నను అవకాశము నిచ్చును.

భయము :

నరుని గుటించిన భయమంతటిని పోగొట్టుకొనినాడ
నని నేను గట్టిగా నమ్ముచున్నాను. భగవంతుడు సర్వ వ్యాప
కుడై యుంటను నేను గ్రహించినాడను.

భాగ్యము :

నిజమునకు నరుల అండయే భాగ్యమగును, గాని బంగా
రును, వెండియు సంపద కాదు.

భారీయంత్రము :

భారీయంత్రములవలని అధికోత్పత్తిని అమ్ముకొనుటకై
యితర దేశములతో పోటీపడి, సదా విరోధిభయముతోడ,
శాంతివిహీనమగు బ్రతుకే బ్రతుకవలసియుండును.

భౌతిక శాస్త్రాభివృద్ధివలన చేజిక్కనున్న ఎలక్ట్రిసిటీ
మున్నగు శక్తుల వినియోగమును నిషేధింతురాయని అనే
కులు ప్రశ్నింతురు : ఎవరన్నారు ? ఆ ఎలక్ట్రిసిటీతో తన
పనిముట్లను, తన సాధనములను పల్లెటూరువాండ్రు వాడుకో
గల్గునెడల, ప్రతి యింటను ఆ శక్తికి స్వాగతమే. లాభకర
ముగా గ్రామములలో ఉత్పత్తికాగల వస్తువులను మాత్రము
నగరములందు ఉత్పత్తి చేయుటకు నేను సమ్మతింపను.

పాశ్చాత్యుల మాదిరిగా భారతీయులు యంత్ర పరి
శ్రమలను అభివృద్ధి చేయబూనకుంద్రుగాక. ఇంగ్లాండువంటి
ఒక్క చిన్న లంకయొక్క సామ్రాజ్యపు అర్థనీతి ప్రపంచ
మును గొలుసులతో బంధించివేయుచున్నదే ! ముప్పదికోట్ల
జనముగల జాతి అటువంటి దోపిడిపద్ధతికే పాల్పడునెడల,
మిడుతల దండువలె లోకమును బీడుక్రింద మార్చివేయదా !

అధికోత్పత్తి గుఱించిన వెఱ్ఱి ఆరాటమే లోకమును విప్లవములలో ముంచి, దుఃఖాలపాలు చేయుచున్నది.

భీరుత్వము :

భీరుత్వము దౌర్జన్యము అను రెంటిలో మాత్రమే ఏది అవలంబనీయమని ప్రశ్నించుచో, దౌర్జన్యముచే వరించు డని సలహా యిత్తును. చూడుడు, 1908 వత్సరమున కొందఱు నన్ను చంపప్రైబడినప్పుడు, నా జ్యేష్ఠ పుత్రుడు తా నచ్చో నుండినచో తాను పారిపోయి నన్ను చంపుచుండ విడిచివేయ వలసి యుండెడిదా, లేక తనకు కాయకబలముండి, దానిని ప్రయోగించు కుతూహలము నుండినయెడల, దానితో నన్ను రక్షించి యుండవలసినదాయని యొకప్పుడు ప్రశ్నించినాడు. దౌర్జన్యమును వినియోగించియైనను అతడు నన్ను రక్షించి యుంట విధియని చెప్పితిని. అట్టి హేతువుతోడనే నేను 'బోయరుయుద్ధము'లో పాల్గొంటిని. అటులనే హింసా మార్గమునందు విశ్వాసముగలవారికి, ఆయుధప్రయోగ శిక్షణ మును ప్రతిపాదింతును.

భారతజాతి భీరుత్వము వహించి మానరక్షణను మాని, అవమానముపాలై, నిస్సహాయ దశలో పడియుండు టకు మారుగా, ఆత్మరక్షణార్థము ఆయుధధారణము చేయుట నాకు ఇష్టము.

మతము :

నా మతమనగా నా అభిప్రాయ మిది. అన్నిమతముల కన్న హెచ్చుగా నేను అభిమానించు హిందూమతమని అర్థముకాదు. నా మతము ఆ హిందూమతమునకును పర

మైనది. అది ఒకని నైజమునే మార్పుచేయ సమర్థమైనది. సతతము పునీతుని చేయుచుండు సత్యముతో నెన్నడును ఎడబాటు పొసగనీయని, అనుసంధానమును కూర్చు శీలము నా మతము.

## మద్యపానము :

మద్యపాన దోషము ఎందఱి శ్రామికుల శుభనిలయములనో స్మశానముగ మార్చివేసినది. ఒకప్పుడు భద్రావాసములై, శాంతిసదనములై యొప్పుచుండిన గృహములలో ప్రవేశించిన యీ మద్యపిశాచము ఎట్టి భీభత్సము గావించునో, మగలు త్రాగుబోతులగుట తటస్థించిన మగువలకు బాగుగ తెలియును.

మద్యముమీద వచ్చు ప్రభుత్వాదాయము నష్టమగునందురేని, అందుకై తత్క్షణము సైనిక వ్యయమును తగ్గించివేసి పరిస్థితుల కనుగుణముగా ఎట్లో గడుపుకొనుమని ప్రధాన సేనాపతికి చెప్పివేయ గోరెదను.

## మధ్యవర్తి భాష :

భారతీయ యువజనులను సర్వవినాశకరమగు పరభాషా మధ్యవర్తిత్వమునకు లోనుచేయుట పరప్రభుత్వము యొక్క మహాద్రోహకార్యములలో నొకటిగ చరిత్ర పేర్కొనగలదు. ఆ పరభాషా మధ్యవర్తిత్వము మనజాతిని నిస్త్రాణలో పడవేసినది. మన విద్యార్థుల ఆయువును హరించినది. వారిని స్వజనమునుండి వేఱుచేసినది. విద్యాభ్యాసమును అనవసరముగా వ్యయకారణము గావించినది. ఈ విధానమే యింకను సాగునెడల, జాతియొక్క ఆత్మయే వినాశము కాగలదు.

మ ర ణ ము :

ఒక నాణెముయొక్క రెండు ముఖములను బోలి చావు పుట్టువులు ఒకే విషయముయొక్క రెండు అవస్థలై యున్నవి. నిజముగ చూడ బ్రతుకు, సుఖానందములకన్నను, చావు, జీవన బాధలు, మహోపకారకరములుగ నాకు తోచు చున్నవి. మానవజీవనచరిత్రను విచారించిన యెడల, బాధలు, చిక్కులు లేకున్నచో మనబ్రతుకున ప్రీతిగొలుపు విషయమే యుండదు. సీతారాముల కష్టములు, చిక్కులు విడిచివేసినచో రామాయణమును చదువుకొను కుతూహ లము గొలుపు అంశములే యుండజాలవు. రావణసంహారము పిమ్మట, సీతారాము లనుభవించిన వైభవ చరిత్ర రామా యణమున అతి స్వల్పభాగ మనవచ్చును. మనమందరమును బాధలు, మరణము అనువానియొక్క శుభంకరాంశమును గ్రహించి, వానివలన మనము పొందగల ఆత్మపారిశుద్ధ్య మును, మనోవికాసమును గుర్తించి పాటించి మేలుగాంతుము గాక.

ప్రపంచములో ఎవరో యొకరు పుట్టనట్టి, మరణించ నట్టి నిమిషము లేదు. అట్టి యెడ, పుట్టువునుగూర్చి సంతో షించుట, మరణమన్న ఏడ్చుట మూర్ఖతయని గ్రహింప వలయును.

మరణము నిరంతరము జరుగుచుండు చక్రపరిభ్రమ ణామే. జననములు తదనంతరపు ఉదంతములు నెమ్మదిగ జరుగు చుండు పరివర్తనములే. జీవనముయొక్క పరిణామమునకు జననము ఎంతముఖ్యమో, మరణమును అంతప్రధానమైనదే.

మరణము ఎప్పుడు సంభవించినను వరప్రసాదమే. మరణము దుష్టపిశాచముకాదు; మిత్రులందఱిలో యథార్థ మౌ మిత్రుడు. అతడు మన యాతనలనుండి విడిపించును; మన కిష్టములేకున్నను సాయము చేయును. అతడు సదా మనకు నూతనావకాశములను, నూతనమగు ఆశలను కల్పించు చుండును అతడు నిద్రవలె మన అలసటను దీర్చును. ఐనను కూడ స్నేహితుడొకడు మరణించెనేని, విలపించుట మన కొక మూఢాచారమై పోయినదే!

మరణముయొక్క తత్వమును మనము గ్రహించిన యెడల, ఎటులైనను చావును తప్పించుకొని బ్రతికియుండ వలయునను వెఱ్ఱి ఆతురపాటు మనను విడుచును. అన్ని చింతనలను విడిచి యితరులను చంపియు, వారికి హింసల గల్పించియైనను మనము బ్రతుకవలయునను దురాలోచన యుండదు.

జన్మాంతరము కలదను సిద్ధాంతమున విశ్వాసము గల వారికి మరణమనిన భీతియు, జననమనిన ప్రీతియు ఉండుట విడ్డూరముగ కాన్పించును.

**మాతృభాష :**

ఒక్క భారతీయుడైనను తన తల్లిభాషను మఱచుట గాని, ఉపేక్షించుటగాని, మాటాడుట లజ్జించుటగాని లేక తానా మాతృభాషలో ఆలోచన చేయజాలననుటగాని లేక తన భావములను తన మాతృభాషలో శ్రేష్ఠముగ సాగించు టకు అశక్తుడగుటగాని లేక తన మనస్సునను నున్న తలపులను

మాతృభాషలో తన పొరుగువారికి విప్పిచెప్పలేననుటగాని నే నోర్వజాలను.

మానవ వృత్తి :

దేవుడు గావించిన జీవసృష్టిలోనికెల్ల, తన స్రష్టను గుర్తెఱుగ జాలునటుల సృజింపబడిన జీవి మానవుడొక్కడే. కావున మానవుని జీవితగమ్యము దినదినము తన ఐహికాభ్యుదయమును పెంపుచేసికొనుటకైనను, తన ఐహిక సంపదల నభివృద్ధి చేసికొనుటకుగాక, అనుదినము తన సృష్టికర్తను అధికాధికముగ సమీపించుచుండుట వాని ప్రధాన వృత్తిగ నుండగావలయును.

క్లిష్టసమయమున ఆదుకొనగలది శీలమేగాని, యేదో సంపద కాదు.

మిల్లు యజమానుల సాయము :

మిల్లు యజమానులును, అట్టి యితరులును కస్తూరిబా నిధి ధర్మకర్తలుగా చేరుట నా అహింసకొక శ్లాఘనీయాంశమే. ఎవరి వ్యాపారము బలాత్కారముగగాక, హేతుబద్ధమగు వాదనతో నిలిపివేయవలయునని నేను అభిలషింతునో, అటువంటి మిల్లు యజమానులతో మైత్రిసలుపుటకు నేను సిగ్గుపడను... ఆ ధర్మకర్తల సందర్భమున మిల్లు సాహుకారు లగువారు, సాహుకారులు కానివారి నిర్ణయముల నెన్నడును అన్యమార్గములకు త్రిప్ప ప్రయత్నించియుండలేదని సంతోషముతో నేను చెప్పగలను. వారి మేళనము ఆ నిధికి మేలుగను, లాభకరముగను నున్నది.

మేలి సామెత :

పెందలకడ నిద్రించుట, పెందలకడ మేల్కాంచుట నరుని ఆరోగ్యవంతునిగను, ఐశ్వర్యవంతునిగను, విజ్ఞానవంతునిగను జేయును" అనునదొక మేలి సామెత. తొమ్మిది గంటలకు పరుండుట, నాలుగు గంటలకు లేచుట మంచి ధర్మసూత్రము. కడుపులో నేమిలేకుండ ప్రక్క జేరవలయును; కాన సాయంతనము 6 గంటలకు తుదిభోజనము చేయుము.

మోక్షము :

ఆత్మసాక్షాత్కారమునకై నేను ఆరాటపడుచున్నాను. ఈ జన్మలోనే మోక్షమును పొంద వాంఛించుచున్నాను. నాజాతీయసేవ నాఆత్మను ఐహిక సంబంధమునుండి ముక్తను చేయుసాధనయందొక అంశమే... నశ్వరమగు ఇహలోక రాజ్యమును నేనుకోరను. మోక్షమనంబడు దైవరాజ్యమునే నేను కాంక్షించునది. ఆ నాకాంక్షితార్థసిద్ధికై నేనొక కొండ గుహలోనికి పోవుట అవసరముకాదు. నేను గ్రహింపవలెనే గాని, నావెంట ఒకటి (గుహ)యుండనేయున్నది.... శాశ్వత మోక్షశాంతిరాజ్యముంగూర్చిన నాయాత్రలో నా దేశాభిమానము ఒకానొక మజిలీయే !

మోక్షమనగా మలిన సంకల్పములు బొత్తుగా అంతరించి పోవుటే. నిరంతర తపశ్చర్యలేనిది, మలినసంకల్పములు అంతరింపవు. ఇది సంభవింప గోరుదునేని, అందుకు ఒక్కటియే ! ఒక మలిన సంకల్పము నీ దరిచేరినతోడనే, సత్సంకల్పముతో దానిని ఎదుర్కొనుము. ఈశ్వరానుగ్రహముతో ఇది సాధ్యమగును.

(10)

శరీర దాస్యమునుండి ఆత్మను విడుదలచేసికొనుటకగు సాధనములలో నేనుచేయు జాతీయసేవ ఒకభాగమేసుమీ! నేను చేయు జాతీయసేవ కేవలము స్వార్థపరమైనదిగను నెన్న వచ్చును. కాని నశ్వరమగు ఐహిక స్వరాజ్యముకొఱకు నే నపేక్షించుటలేదు. నేను మోక్షమనెడు స్వారాజ్యముకొఱకే ఈతీవ్రప్రయత్నము చేయుచున్నాను.

మౌనము :

మౌనమువలన గొప్ప ప్రయోజనమేమన, నాకది మాటల పొదుపును నేర్పినది.... అనాలోచితమగు మాట నా నాలుకనుండి ఎన్నడును జారదని నాకు నేనొక యోగ్యతా పత్రిక నిచ్చుకోగలను. సత్యారాధకుని ఆధ్యాత్మిక శిక్షణ మున ఒకయంశము మౌనమని నాఅనుభవము నాకు నేర్పినది.

ఇంకేదియు చేయజాలనంతగా, మౌనము మనకోపము నణచగలదని నేను బాగుగ గ్రహించితిని.

మీనాలుకను ముడుచుకొని, సంఘసేవయందు మీ కరచరణములను వినియోగించుడని నాసలహా. కొన్నియేండ్ల పాటు మీరటులచేసితిరా, పూర్ణప్రయోజనకరమై ఎన్నడును వ్యర్థముకాజాలని భాషణములను మీరుపలుకజాలుదురు.

మౌనము దివ్యజ్ఞానమనదగు సందర్భములుండును. మౌనము నేను సాధించిన ఘనతమవిషయముకాదు; కాని నా కది యొకగణనీయవిషయమే. జైలులో నేను15దినములుమౌన దీక్షలో నున్నపుడు, నేను సప్తమ స్వర్గమందున్నట్లనిపించి నది. నిలువయుండిపోయినపనులు బాకీ తీర్చుకొనుటకు నేను మౌనము పూనుదును. దానివలని లాభము అల్పవిషయము.

యథార్థమగు మౌనమును చీట్లు వ్రాయుట చేతను, వానిద్వార మున సంభాషణ నడుపుట చేతను భంగము చేయదగదు.

కొంతకాలము అటువంటి మౌనమును అభ్యాసము చేసినపిమ్మట, మౌనముయొక్క ఆధ్యాత్మిక ప్రయోజనమును కనుగొంటిని. నేను భగవంతునితో సహచర్యము నెఱపుటకు అటువంటి సమయమే ఉత్తమ తరుణమని ఆకస్మికముగ నా మనస్సునకు తెలియవచ్చినది. ఇప్పుడు మౌనమునకనుకూల ముగ నాతత్వమే నిర్మితమైయున్నట్లుల అనుభవము కలుగు చున్నది.

## యంత్రములు :

గ్రామపరిశ్రమలను ఉద్ధరింపవలెనను మోజుతో, యంత్రముల వినియోగమునే ఖండింతునని పలువురు సోష లిస్టులు, కమ్యూనిస్టులు మొదలగువారు తర్కింతురు. నా చేతులే యంత్రములుగదా ? ఈరాటము యంత్రముకాదా ? నా అభ్యంతరము వేలాది ప్రజలకు పనిలేకుండ చేయు పెద్ద పెద్ద యంత్రములను గుఱించియే...

ఇక్కాలపు యంత్రప్రయోగపు పిచ్చి పేదలగు లక్షలాది స్త్రీపురుషుల నోటిదాపు కబళమును లాగివేసి, వారికి గత్యంతరము చూపు యోచనయే లేకుండ, ఏకొలదిమంది సాహుకారులనో అధికాధికముగ ధనసంపన్నుల చేయుటకగు పెనగులాటగనున్నది.

మిల్లులు, ఫ్యాక్టరీలు కొన్ని వందలమందికి పనికల్పించుట నిజమే కాని, అందువలన కొన్ని వేలమందికి జీవనోపాధి నాశ నమై పోవుచున్నదే !

భారతభూమి యంత్ర పరిశ్రమలమయమగునెడల, ప్రపంచములో ఏదేశములను దోచుకొందమాయని వెదుక వలసివచ్చును. బ్రిటను, జపాను, అమెరికా, రష్యా, ఇటలీ మొదలగు దేశముల నావికాబలము నెదిర్చిపోరాడుటకు సిద్ధపడవలసియువచ్చును.

**యజ్ఞము :**

తమకున్న సంపదలను పేదలకొఱకును, నిస్సహాయుల కొఱకును దానము చేయునిమిత్తము కానిచో, ఆ సంపదలను స్త్రీలుగాని, పురుషులుగాని తమకడ నిలుపుకొనుటకు అధికారము గలవారుకారు... పేదలను, దీనులను సేవించుటను మించిన యజ్ఞమేమియుండగలదు ?

నిర్దోషియు, నిర్మలుడునునగు ఒకమానవుని ఆత్మార్పణము వేలకొలంది యోధుల ప్రాణార్పణముకంటె ఎన్నిరెట్లో అధికము. మహాప్రభావముకలది. ఒక్కసుజనుని ఐచ్ఛిక త్యాగము, ఎంతటి బలయుతుడైన క్రూరప్రభుని విజృంభమునైనను నిరోధింపజాలును. అటువంటి పటిష్ఠమైనా ఆయుధమును దేవతలుగాని, దానవులుగాని సయితము కనిపెట్టియుండ లేదు.

యజ్ఞము సలుపకుండ, అనగా దానము చేయకుండ, తినునతడు దొంగయని చెప్పు శ్లోకమొకటి కలదు. దేవుడు మనకు అధికారమును, సంపదను ఇచ్చునెడ, వానిని మనము మానవకోటి యుపకారార్థము వినియోగించు కొఱకై యిచ్చుచున్నాడు గాని, స్వార్థులమై యింద్రియ భోగములకై వినియోగించుకొనుటకుగాను ఇచ్చుటలేదు.

యుక్తి :

యుక్తి అన నాకు వెగటు. ఏమన తఱచుగా యుక్తి ప్రయోగము నీతి సత్యములకు వ్యతిరేకముగ నుండును. హింసకు మూలమగును.

యువకులు :

అవినీతిపాలైపోవు మన యువకులు, నైజముచేతనే అట్టివారనలేము. తగిన శిక్షణ లేక నిస్సహాయులైపోయి, అనాలోచితముగా దుర్మార్గములలోనికి త్రోయబడుచున్నారు. అందువలన వారు తమకును, తమసమాజమునకును అనర్థ కారకులగుచున్నారు.

యువకులు శరీరముతో పాటుపడు శ్రమజీవనమనిన వెఱపు జెందుటచే, వారు ధైర్యసాహసములకు దూరులై నిర్వీరులుగనున్నారు.

యోధులకు సలహా :

మీకు (యోధులకు) భూములుకావలయునా, దొరక గలవు. వానిని బాగు పఱచి, ఆదర్శ ప్రాయములగు చేలుగ మార్చుడు. ప్రజాసామాన్యమును క్రుంగదీయుచున్న స్తబ్ధత్వమును నిర్జింతుగాక. కష్టపడి కృషిచేయుటలో మార్గదర్శులగుట మూలమున మాత్రమే మీరటుల చేయగల్గుదురు. తెలివితేటల తోడను, చాకచక్యము తోడను, మీరు చీపురును, తట్టను పట్టనేర్చి యుండవలయును. మరుగుదొడ్ల మురికి దొలగించుట అసహ్యకార్యమనిగాని, గౌరవహీనమని గాని తలంపరాదు. ఈపనిలో ఉత్తీర్ణులై 'విక్టోరియా క్రాసు' పతకమును గడించుట వీరోచిత కార్యము కాగలదు.

రా జీ :

సత్యాగ్రహి యగువాడు, గౌరవప్రదమగు రాజీకిగల అవకాశము నెన్నడును చేవిడువడు. కాని అది వ్యర్థమగుపట్ల పోరాటమునకు వెనుదీయడు. వానికి పోరాటము సాగించుటయు, పోరాటము నాపుటయు ఒక్కటే. ఒకే లక్ష్యసిద్ధికే అతడు పోరాడినను, పోరాటము నాపినను అతడు ఎవరియెడను ఎన్నడును సంశయమును పూనడు. ఏ మాత్రము సందు దొరకినను మైత్రికై యే చేయిజాచును.

మానవుడు సిద్ధాంతముగ సత్యమని తెలిసికొనినదానిని ఆచరణయందు సాధన చేయుట సదా సులభముకాదు. జీవులన్నియు ఒక్కటే. అందువలన పుణ్యశీలుని, పాపిని ఒకేతీరున చూడవలసియున్నది. "ఒక పండితునియెడను, కుక్కయెడను, కుక్కను వండుకొని తినువానియెడను సమదృష్టితో నుండవలయును" అని గీత చెప్పుచున్నది. నేనొక పామువిషయములో, స్వయముగ నేను దానిని చంపకున్నను, దానిని చంపుటలో కారణభూతుడనైతిని... కాని అటులగాక తప్పినది కాదనుట వలని లాభములేదు... నేను గ్రామసీమలో సిద్ధముచేయబడిన మంగలికత్తినే వినియోగించవలసినది. ఒక గ్రామవాసి మంగలికి ఉపకారము చేయబూని, అతడెట్టి కత్తిని వినియోగించుచున్నను సరియేనని, వానిచే క్షౌరము చేయించుకొంటిని. కాని ఒక్క యంశమున వానితో రాజీ పడలేక పోతిని. అతడు నాతో సరిసమానముగజూచి హరిజనునికి క్షౌరము చేయనొల్లని కారణమున ఆమంగలిని వదలుకొం

టిని... నా యీ వర్తనమును ఇతరులు అనుకరింపకుందురు గాక.

కొన్ని ప్రధాన ధర్మసూత్రములుగలవు; వానిపట్ల రాజీకి అవకాశముండదు. వాని ఆచరణమునందు ప్రాణమును సయితము అర్పణ చేయవలసినదే. ఒకడు కత్తి జూపి నా మతమును మార్చుకొమ్మని పట్టుబట్టును. ఒక మిత్రుడు మాంస భక్షణచేయుమనియో, మద్యపానము చేయుమనియో బాలాత్కరించును. ఆ నిర్బంధములకు తలయొగ్గుటకంటె ప్రాణమును తృణముగజూచి విడుచుట మంచిది; విధికూడను.

నా జీవితోదంతము లందెల్లెడల, నాసత్యనిష్ఠయే రాజీ యొక్క శోభను గ్రహింప జేసినది. రాజీభావము సత్యాగ్రహామునందు అత్యంత ప్రధానాంశముగ నాడుత్తర జీవితమున తెలిసికొంటిని. అందువలన నేను తఱచుగా నా ప్రాణమును అపాయ స్థితిలోనికి దెచ్చుకోనయ్యెను; స్నేహితుల కినుకకు పాత్రుడ కావలసి వచ్చినది. కాని యీ సత్యము వజ్రమంత కఠినమును, శిరీషపుష్పమంత కోమలమునైనది.

రా మ నా మ ము :

స్వార్థరహిత గృహస్థ ధర్మమే మానవ సద్ధర్మమని భావించుస్వార్థరహితసంసారి దేశసేవాభిలాషి కాగలడు. రామనామము కార్యభారమును తగ్గించి త్యాగశీలతను అలవఱచును. బుద్ధిభ్రమను కలిగింపదు. సేవాపరతంత్రత లేకుండ సమ్యగ్జ్ఞానము అలవడదు.

నేను రామనామమువలన ఉద్ధరింపబడినటులనే క్రైస్తవులు ఏసుక్రీస్తునామ జపమువలనను, మహమ్మదీయులు అల్లా నామ జపమువలనను శాంతిని బడయ గల్గుదురు.

చదువులు ఎక్కువగుటచేత ఎవరిదృష్టి చెడటిపోలేదో అట్టి పాఠకునికొఱకు రామనామమును గుఱించి ప్రస్తావించుచున్నాను. మన జీవితములో అనేక దశలందు చదువులు మనకు తోడ్పడుచుండును. కాని పరిశోధనలు, అపాయములు, సంభవించు సమయములందు అవి కేవలము నిష్ఫలములగుచున్నవి. అట్టి సమయములందు (దైవ) విశ్వాసము మాత్రమే మనలను రక్షింపగల్గును.

రామనామమును సర్వవిధముల శోధింపుచు, ఆ రామనామము తమ నెల్లెడల సంరక్షింప వలయునని అడియాసలు పెంచుకొనువారికి రామనామము ప్రయోజనకారి కాదు. ఎవరు దైవభీతితో వర్తింతురో, ఎవరు ఆత్మనిగ్రహము కలిగి యుందురో, ఎవరు సర్వదా ప్రయత్నించుచును సఫలతగాంచలేకుందురో అట్టి వారికి రామనామము ఉపకరించును.

లెక్కలు :

దేవుని లెక్కల బుక్కులలో మన చేతలుమాత్రమే నమోదు చేయబడును. మన చదువులకు, మనమాటలకు అందు తావుండదు.

మన చేతల మంచి చెడ్డలన్నియు అందు వ్రాసియుంచబడును. జగత్తులో అంతకు మించిన లెక్కలు లేవు.

## వర్ణము :

ధర్మశాస్త్రములలో 'వర్ణ' మనగా 'ధర్మ'మని చెప్ప బడినది... హైందవధర్మము మనలను భయమునుండి రక్షించి నది. హైందవ ధర్మము నాకు సహకారియై యుండనియెడల నేను ఆత్మహత్య చేసికొనుటతప్ప గత్యంతరము లేకపోవును.

ఎవడు ఏ వర్ణములో పుట్టునో, ఆ వర్ణవృత్తి తన ధర్మ మని భావించి (నీతి విరుద్ధ కార్యము ఏవర్ణ ధర్మమును కాజా లను) చేయుచుండగా లభించు ఆదాయమునుండి తన సామాన్య జీవికకు కావలసినంత యుంచుకొని, మిగిలినదానిని సర్వజన కల్యాణమునకై ఉపయోగించుచుండును.

నాలుగు వర్ణములను ఈశ్వరుని శరీరముయొక్క నాలుగు అవయవములతో పోల్చి వేదములు వర్ణించుచున్నవి. శరీరమందలి అవయవములలో హెచ్చుతగ్గులు లేనట్లే, యీ వర్ణములలో హెచ్చుతగ్గులు లేవు.

ఈ నాడు హెచ్చు తగ్గుభావములు కల్పనయై, సంఘ మున అశాంతి, కలహములు వ్యాపించినవి.

గీతలోని వర్ణధర్మము ఇట్టిసామ్యధర్మమేగాని, సామ్య వాదముకాదు. అట్టి వర్ణ ధర్మమును ఆచరణయందుబెట్టి ప్రజలందఱును ధన్యులగుదురుగాక.

వర్ణధర్మమును అనుసరించుటలో స్వార్థ మెంతమాత్ర ము నుండదగదు.... బ్రాహ్మణుడు బ్రహ్మను తెలిసికొని, బ్రహ్మనుగూర్చి తెలుపుటలో కాలము వినియోగించుగాక. తన జీవికకు గతి దేవుడే చూచునని నమ్మియుండవలయును.

క్షత్రియుడు ప్రజలను పాలించు కర్తవ్యమును నెర వేర్చుగాక. అందుకుగాను తన జీవికకై కొంతమాత్రము వ్యయము చేసికొనదగును.

వైశ్యుడు జనులమంచికై వ్యవసాయము, గోరక్షణను, వ్యాపారము చేయుగాక. అందు లభించిన ధనములో కొంత తన జీవికకై న్యాయముగ కావలసినంత దీసికొని, తక్కిన దానిని లోక క్షేమమునకై వినియోగించవలయును.

ఇట్లే శూద్రుడు సేవచేయుటలో తనధర్మమును నిర్వహించును.

సామాన్యముగా వర్ణనిర్ణయము జన్మనుబట్టియే చేయబడును. కొంతవఱకు మాత్రము కర్మనుబట్టియు చేయనగును. ఇట్టి వర్ణధర్మమునుబట్టి ప్రపంచము నలుమూలల, ఎల్లెడల ఆనందము తాండవించును. అన్యాయము తొలగిపోవును. ఈర్ష్య నశించును. ఎవడును ఆకలిచే చావడు...

ఎవనికి వాడు తనయిష్టమైన పనిని మంచిదనుచు పూనునెడల వర్ణసంకరమైనదని భావింతును.

వాగ్దానము :

అన్నిటికంటె పవిత్రుడవును, నిర్దోషివియునై యుండ, జాగరూకుడవై యుండనెంచుము. నీప్రాణమునైనను ఒడ్డి నీ వాగ్దానముల నిలుపుకొనుము. వాగ్దాన భంగమనగా సత్య ద్రోహమే.

సామాన్యత్యాగముల సాయమున సాధ్యముగాని కార్యములు, అసాధారణత్యాగముల విధించు దీక్షల మూలమున

సుసాధ్యములు కాగలవు. కావుననే వ్రతములు జీవితమును శుద్ధింపగలవని విశ్వసింపనగుచున్నది.

ఆవేశదశయందు దీక్షలుపూనుట తేలికయే. కాని ప్రలోభము లలముకొనుతరిని, ప్రతినల నిలుపుకొనుట దుస్సాధము.

ప్రాచీనకాలమున ఆదర్శపురుషుల నోటిమాటయే 'నోటు' క్రింద చెల్లుబడి యయ్యెడిది. కోట్లాదిధనముతో ప్రమేయముగల వ్యవహారములు వాగ్రూపమగు అనుమతి మాత్రముతో నిర్వహింప బడెడివి. ఇంతేల? మన సాంఘిక వ్యవస్థయంతయు ప్రమాణ వచనముయొక్క పవిత్రతపై నాధారపడియున్నది.

## వ్యాపారము :

పూర్తిగా న్యాయసమ్మతమగు వ్యాపారము చేయుట కష్టసాధ్యమే; కాని అసాధ్యముకాదు. వ్యాపారము ధర్మబద్ధమైనకొలదిని అది హెచ్చు జయప్రదముగ సాగగలదనుట యథార్థము... సత్యమేమన ధర్మానువర్తనమునకును అధిక సంపాదనకును పొత్తుకుదురదు. ఆత్మపరిశోధన చేసికొనువెడల, ధర్మబద్ధమగు వ్యాపారములో చిక్కు ఇసుమంతేని యుండజాలదు. ఉన్నచిక్కంతయు వ్యాపారియొక్క అత్యాశ యందున్నది.

## విగ్రహారాధన :

ఒక పరమలక్ష్యమును సూచించుటకు ఉపయోగపడిననే విగ్రహారాధనను హిందూమతము అంగీకరించుచున్నది.

కేవలము విగ్రహమే పరమప్రాప్యము అగునెడల అది పాప
హేతువగు బొమ్మల పూజయే యై పోవును.

నేను విగ్రహారాధకుడను, విగ్రహ నాశకుడనుకూడ
నగుదును. విగ్రహారాధకులకు వెనుక ఆధారముగ నున్న భావ
మును నేను మన్నింతును. మానవజాతి ఉన్నతికి తెచ్చు
టకు అదెంతయు ప్రయోజనకారి అగుచున్నది. ఈభావ
మును అంగీకరించుటలో విగ్రహారాధకుడనే. భగవంతుని
ఒకడు తాను అర్చించు విధానమునందుతప్ప మఱే యేలాటి
యితర విధానమునందును, సద్భావమును అంగీకరింప నిరా
కరించుటనెడు దురాగ్రహ రూపమగు విగ్రహారాధనను ధ్వం
సము చేయవలయుననెడు అర్థమున నేను విగ్రహనాశకుడనే.

విజ్ఞానము :

విస్తారముగా చదువుకొని, విస్తారముగా గ్రంథములు
వ్రాసి, విస్తారముగా లోకజ్ఞానమును సంపాదించి, తుదకు
తాను గ్రహించినది బహు స్వల్పమని నరుడు తెలిసికొనును.

విద్య :

ఆధునికవిద్య మన అనుదిన జీవితముతో సంబంధముకలది
కాదు. అది మనశరీరమునుగుఱించియు మనను అజ్ఞానములో నే
విడుచుచున్నది. మన గ్రామములగుఱించియు, మన భూముల
గుఱించియు, మన విజ్ఞానముయొక్క గతియుఅంతే... మన శరీ
రమునుగుఱించి, మన యింటినిగుఱించి, మన గ్రామమును
గుఱించి, మన పరిసరముల నివసించు వారినిగుఱించి, మనము
పండించు పంటలగుఱించి, వాని చరిత్రను గుఱించియు ఇతర
విషయములను తెలిసికొనుటకు ముందుగా నేర్వవలయును.

## విద్యాభ్యాసము :

బడులకు, పాఠశాలలకు, కళామందిరములకు పోవుచుంట విద్యాభ్యాసమనుకొనుట వట్టి మూఢాభిప్రాయము. ప్రపంచమున మన స్కూలులు, కాలేజీలు తలజూపని కాలమున ఎంతెంతటి పండిత ప్రవరులో లోకమున సుప్రసిద్ధులై వెలయగల్గిరి. ఆత్మ విద్యకు సాటిరాగల చదువెంచుననుండబోదు. సత్యజ్ఞానములో పాల్గుపోవు తుక్కును పట్టుకొను జల్లెడలనగ మనస్కూళ్లు, మనకాలేజీలు మనను తయారుచేయుచున్నవి. చెఱిగి పారవేయదగిన ఊకను ప్రోగుచేసికొనుచున్నాము.

## విద్యార్థి :

అత్యంతమగు భావస్వాతంత్ర్యమును, భావప్రకటనయందు స్వేచ్ఛయు విద్యార్థులకు ఉండవలసినదే. వారే రాజకీయపక్షము నెడలనైనను బహిరంగముగా సానుభూతి తెలుపనగును; కాని వారు విద్యాభ్యాసము చేయుకాలమున నా అభిప్రాయముతో, కార్యక్షేత్రమున ప్రవేశించు స్వాతంత్ర్యము వారికుండదగదు. విద్యార్థి చదువుల సాగించుచు ఏకకాలమందు రాచకీయ కార్యములలో గూడ పాల్గొనుట పోసగదు.

## విదేశ వ్యాపారము :

పట్టణములకు, నగరములకు వలయు వానినెల్ల భారతావనియందలి పల్లెలు ఉత్పత్తి చేసి సమకూర్చి పెట్టుచుండెడివి. నేడు మననగరములు విదేశీయులవ్యాపార నిలయములైపోయి,

పల్లెలను సయితము పనికిమాలిన విలాయతి చవుకవస్తువులతో నింపి వేసినవి.

విధి :

విధ్యుక్త ధర్మములందు ఒకటి గొప్పది, మఱొకటి లొజ్జు అనుగణనలేదు. కీర్తినిగాని, ప్రతిష్ఠనుగాని సరకుగొనక తుదిని మిత్రుల అభినందనములగాని, ఆమోదమునుగాని నిరీక్షింపక ధర్మవిధుల నిర్వహింపవలయును.

విధి నిర్వహణము :

ఒకని విధినిర్వహణము ప్రజాభిప్రాయముపై ఆధారపడి యుండదగదు. మనస్సాక్షికిని, వివేకమునకును ఏది ధర్మమని తెలియునో, అద్దానిని ఇతరులు అక్రమమని తలంచినను లెక్క సేయక తాను నిర్వహింపగా వలసినదే.

ప్రేమమార్గము అనంబడు అహింసా పథమున ఒక్కొక్కెడ ఏకాకినై నడువవలసి వచ్చును.

ఏసమయమునగాని నా విధ్యుక్త ధర్మమెటున్నది అని విచారించుకొనునేగాని, శూరపురుషుడెన్నడేని దీనినిర్వహణమున నాకేమి వాటిలునోయని చింతింపబోడు. సక్రమముగ నిర్వహింపబడు విధాయక కర్మ దాని సత్ఫలము నదియిచ్చియే తీరును; ఐనను కర్త దాని ఆశపెట్టుకొని నడువనదగదు.

గృహస్థుడనుగాను, న్యాయవాదిగాను, సంఘసంస్కర్తగాను, రాజకీయ తంత్ర వేత్తగను, నావిధులను సక్రమముగ నిర్వహించు నిమిత్తము దక్షిణాఫ్రికాలోనుండగా నేను ఒంటరి జీవితము గడపవలసి వచ్చినది. అట్టియెడ నా

స్వదేశీయులతోడనైనను, యురపియనులతోడనైనను నాకు గల మానవసంబంధ చర్యలందు నిర్దుష్టమగు అహింసా సత్య సాధనలను, కఠోరనియమబద్ధమగు మిథునధర్మములను నడుప వలసినవాడనైతిని... నేను గావించిన సాధనలనుసాగించి, నేను పూనిన ఆశావిశ్వాసములను వహించినయెడల, ఏ పురుషుడైనను, ఏస్త్రీయైనను నేను పొందిన విజయమును పడయ గల్గుననుటలో ఇసుమంతయు సందేహము లేదు.

వి ధే య త :

క్రమశిక్షణ కలవడిన యోధుడు, పైవారి ఆజ్ఞాపనల నూర్చి సదా హేతువాదనలకు దిగబోక, ఉత్సాహముతో విధేయుడై అనువర్తించును. ఐచ్ఛికభటుడు తన నాయకుని ఎన్నుకొనుసమయమున తన హేతువాదమును వినియోగించు కొనును; కాని ఆతని యెన్నిక ముగిసనపిమ్మట, నాయకుని ప్రతి ఆజ్ఞను విమర్శించుచు, తాను దానిని అనువర్తింపవలసిన తరిని, అధికారి యుత్తరువును తనతర్కమనెడు దాగలిపైనిడి పరిశోధింపబూని తనశక్తిని, కాలమును వ్యర్థముచేయబోడు.

ధర్మనిర్ణయ సందర్భమున దౌర్బల్యమును జూపు డనియో, లోబడిపొండనియో, సలహానిడుచుంటిననిగాని, ప్రోత్సహించుచుంటిననిగాని, యెవరును నన్నాక్షేపించ కుందురుగాక. కాని ప్రతిక్షుద్రవిషయమును ఘనముచేసి, అందేదో ధర్మతత్త్వమిమిడియున్నదను వాదనలకు దిగవల దనియే నేననునది; ఆమాటలను నేనెన్నిసారులైనను చెప్ప గలను.

విప్లవకారి:

విప్లవకారులగు నాసోదరులకు నేను చేయుమనవి యిది. ఉరికంబముమీద మరణించు సాహసయజ్ఞము, బలియాత్మ ప్రాణ శుద్ధమయినప్పుడు మాత్రమే ఫలప్రదము కాగలదు.

విమర్శ:

ఇతరులను విమర్శలపాలు చేయకుము. నీవిమర్శకుడవు నీవ కమ్ము. నీ వెంతయు సుఖింప గల్గుదువు.

నా జీవితకాలమందంతటను నేను నన్ను మెచ్చుకొని పొగడు మిత్రులవలనకంటె, నన్ను విమర్శించు మిత్రులవలన హెచ్చు మేలును పొందితిని. ఇతరులు మనను ఏవిధముగ చూచెదరో, అటుల మనను మనము చూచుకొనుట మంచిది. మన మెంతగా ప్రయత్నించినను మన యోగ్యతను మనము గ్రహింపజాలము; ముఖ్యముగా మనలోపములను తెలిసికొనుట చాలకష్టము. మన విమర్శకులయెడ కోపముపూనుట మానిననే, మన దోషములను మనము బాగుగ గ్రహింప జాలుదుము.

వీర్యనాశనము:

జననేంద్రియముయొక్క యేకైకమును, మహిమాన్వితమునగు సహజకర్మ సంతానోత్పత్తియే యనెడు భావము స్త్రీని, పురుషుని ఒక్కసారి ఆవేశించినయెడల, తద్భిన్నమగు నే యుద్దేశముతోడి సంయోగమైనను దోషపూరితమగు వీర్య నాశన చేష్టయే యగునని వారంగీకరింపవలసియుండును; తత్ఫలితముగా స్త్రీ పురుషులనుభవించు క్షణకాల సుఖ

తొల్యముగూడ అందుకు సమానమగు శ్రేయస్కరముగాని దివ్యశక్తి వినాశకార్యమనియు నొప్పుకొనవలసినదే.

వి రో ధ ము :

ఇంటిలో కొంచమే అన్నమున్నది. (పేదరాలు)తల్లి. ఆమె బిడ్డలు ఆకలిగొని యున్నారు. వారి క్షేమలాభములు వేఱువేఱు. తల్లి అన్నము తినెనా బిడ్డలకు తిండియుండదు; బిడ్డలు తినిరా, తల్లి తిండిలేకుండ కూలికి పోవలసియుండును. ఐనను వారిమధ్య విరోధమున్నదనియు, ఆ అన్నము కొఱకై నాకిలోవారు కొట్లాడుకొని బలయుతురాలగు తల్లి ఆ అన్నమును లాగికొని తినివేయవలెననియు సిద్ధాంతము చేతుమా?

అటులనే తమక్షేమలాభములు భిన్నములైనను, ప్రజలు ఒండొరులను శత్రులనుగభావించి, హింసాప్రయోగములకు దిగి, కృత్రిమ పద్ధతులతో లాభములగడింప యత్నింపదగదు.

వి లు వ :

డబ్బునకు విలువ మానవజీవులమీద పలుకుబడి గలిగి యుండుటే. (అనగా మానవుల అభిమానమును పొందగలుగు టన్నమాట) అదిలేదా, ఎన్నిలౌకిక సంపదలున్నను నిష్ఫలమే. అటువంటి అభిమానము కలవానికి ఈసంపదలు అవసరములునుకావు.

వి వా హ ము :

వివాహక్రతు సమయమున వరుడు ప్రకటించు ఈప్సితములలో తన వధువు యోగ్యుడును, ఆరోగ్యవంతుడునగు కొమారునికి తల్లియగుగాక అనునదొకటి... సంతానము కని

తీరవలయునని దాని అర్థముకాదు; కాని సంతానము కోరు నెడల ధర్మనిర్ణీతమనెడు భావముతో వివాహము చేసికొనుట ముఖ్యమని తెలియును. బిడ్డల కోరనివారు పెండ్లియే చేసుకో నక్కరలేదు. కామవాంఛా తృప్తికొఱకగు వివాహము వివాహమేకాదు. సతీపతులిరువురకును సంతానము కావలయునని కోరిక కలిగినప్పుడు మాత్రమే సంభోగక్రియ అంగీకారమని వివాహక్రతువునకు అర్థము... ఆ కార్యము దైవ ధ్యాన పూర్వకముగా జరుగవలసియుండును.

వివాహముయొక్క ముఖ్యోద్దేశమే ఆత్మనిగ్రహము.. సత్సంతానార్థము కానట్టి వివాహము వివాహమే కాదు... ప్రథమపుత్రుని 'ధర్మజుడ' నియు అనగా ధర్మనిర్వహణార్థము పుట్టినవాడనియు, తదనంతరము పుట్టినవారిని 'కామజు' లనియు మనువు వర్ణించియున్నాడు.

విశ్వాసమును, అఖండపతిభక్తిని భార్య విధిగా చూప వలసియున్న తీరుననే భర్తయు తనవిశ్వాసమును, పరిపూర్ణాభి మానమును భార్యయెడల చూపవలసియుండును.

వివాహమును పవిత్రనిష్ఠగా స్వీకరించినపట్లు, ఆ కల యిక భౌతికశరీరసంబంధమైనది కాక, పవిత్రాత్మ సంయోగమై విరాజిల్లుచు, ఏయొకరి మరణానంతరమైనను కూడ అభేద్యమై నిలచియేయుండును. ఇట్లు సత్యమగు ఆత్మసంయోగము పరగునెడల విధవగాని, విధురుడు*గాని పునర్వివాహము తలపెట్టుట అసంభవము, అక్రమము, అధర్మమునగును.

---

* విధురుడనగా, భార్యా వియోగమైన పురుషుడు.

యువకునకు భార్యావియోగము సంభవించెనేని అతడు పునర్వివాహము చేసికొనగుచో, అదేవయస్సుగల వితంతువునకు ఆహక్కు ఏల ఉండదగదు? విజ్ఞానప్రేరితమగు ఐచ్ఛిక వైధవ్యము జాతికొక అమూల్యనిధియే. కాని అజ్ఞాన ప్రేరితమును, నిర్బంధమును అగువైధవ్యము మనకొక కళంకము... లోలోన పునర్వివాహచింతలో మ్రగ్గిపోవుచు, ఒక క్రూరాచారమునకు భయపడి పునర్వివాహము చేసికొనసాహసించని వితంతువుయొక్క శాపము, క్షంతవ్యము కాజాలని బానిసతనమున ఆమెను అణచిపెట్టియుంచునంతకాలము ఆసంఘము తలపై పడియేయుండును.

### వి శ్వా స ము :

సామాన్యముగా 'ఋజువు' అనబడు దానిపైన ఆధారపడియుండు విశ్వాసము పసలేనిది !

విశ్వాసము, లేక భక్తి, ఒకరు ఇచ్చిన వచ్చునది కాదు; అదిలోపలినుండియే పుట్టుకొని రావలయును.

భక్తి, అనుభవమువలనజ్ఞానముగమారును. అది హృదయమునుండి వచ్చునదియేగాని బుద్ధి ఆధారమునచేకూరునది కాదు. బుద్ధి యనునది భక్తికి అవరోధముకూడ కాగలదు.

నాకు స్ఫురించు ప్రతియూహయు, ప్రతికర్మయు ఆత్మప్రేరణ ఫలితములేనని నేను గ్రహించినటుల గట్టిగ వాదింపజాలను. కాని నాజీవితములో నేను పూనుకొనిన ఘనతమోద్యమములును, స్వల్పకార్యములుగ నెన్నదగినవియు, పరిశీలనచేసి చూచునప్పుడు, అవన్నియు ఆత్మచే ప్రేరేపింపబడెనని చెప్పుట దోషముకాదని తలంచుచున్నాను.

నేను దేవుని చూచియుండలేదు; మఱియు అతడిట్టి వాడని గ్రహించియునుండలేదు. భగవంతునియందు ప్రపంచమునగల విశ్వాసమును నాదానిగ జేసికొనినాడను. ఆ నా విశ్వాసము తుడిచివేయ వీలుపడునది కాకున్నది. నేనా విశ్వాసమును అనుభూతితో తుల్యముగ భావించుచున్నాను. విశ్వాసమును అనుభూతిగ వర్ణనచేయుట సత్యమును కొంత తగ్గించుట కానగును; భగవంతునియందు నాకుగల విశ్వాసమును అభివర్ణించుటకు తగిన భాషను నేనెఱుగననుట యెక్కువ నిర్దుష్టమనవచ్చును.

## వైరాగ్యము :

వైరాగ్యధర్మమునందు నాకు అభిమానముమెండు; కాని ఆవైరాగ్యమును కర్మలో, కర్మద్వారమున ప్రాపింపవలయును... శరీరము ఆయాపనులలో మునిగి యుండగా, వానియందు నిస్సంగవృత్తి కలిగియుండుటే వైరాగ్యము—సన్యాసము.

## వైరులు :

ఇతరులు మన అభిప్రాయములను ఎటుల మన్నింపవలయునని మనము కోరుదుమో, మనవైరులును అటులకోరుకొను అధికారము కలిగియుందురు. మనప్రతిపక్షులను మనవైపునకు త్రిప్పుకొనగల ప్రతి అవకాశమును వినియోగింపవలయునని అహింసాధర్మము విధించుచున్నది.

## వైస్రాయి భవనము :

నేనొక్కదినము నిరంకుశాధినాయకుడనగుట తటస్థించెనేని, వైస్రాయియొక్క పశువుల గుడిశెలో అనదగు

సట్లున్న ఢిల్లీ హరిజనుల గుడిసెలను శుభ్రపఱచుటలో ఆ దిన మంతయు గడిపెదను. అచ్చో గానవచ్చునంత పేదరికము గాని, మురికిగాని, వైస్రాయి కళ్లముందునసే, ఆయన దరి దాపులనే యుండుట లజ్జాకరము. నామాట చెల్లునెడల వైస్రాయి భవనమును ఒక పెద్ద ఆసుపత్రిగా మార్చివేతును. ప్రెసిడెంటు 'క్రూగరు'గారుండు ఇల్లుచూడరాదా! అది బిర్లా ఆశ్రమగృహము పాటిదైనను కాదు. 'క్రూగరు' నివాసము ఒకకుటీరము!

వ్య వ సా య ము :

బుద్ధియొక్క వ్యవసాయము హృదయముయొక్క వ్యవసాయముకన్న చాల తక్కువదే సుమీ!

శ రీ ర ము :

శరీరమునకు సౌఖ్యములు కొంత పరిమితిలో అవసరములే. కాని ఆ మితిదాటినప్పుడు అవియే సహాకారములగుటకు మారుగా అవరోధము లగును... శారీరకావసరములను ఇంతేల, సంకుచిత ఆత్మప్రేరితమగు బుద్ధియొక్క అవసరములను సయితము తృప్తిపఱచుకొనుచు పోతిమేని, అట్టి చర్య తుదకు ఎక్కడనో ఆగిపోవలసినదేయైె, అది శారీరక మానసిక వ్యభిచారమున ముంచి నాశనము చేకూర్చును.

మన శరీరమునుగుఱించిన పూర్ణజ్ఞానము మనకున్నచో మనము విశ్వమునంతను ఎఱింగినట్లే.

శరీరమును స్వార్థబుద్ధితోడను, ఇంద్రియ భోగము కొఱకును పరపీడనార్థమును వినియోగించినప్పుడు దానిని దుర్వినియోగము చేసినవార మగుచున్నాము. ఇంద్రియము

లను నిగ్రహించి, యావత్ప్రపంచక్షేమము కొఱకును మన శరీరమును వినియోగించి నప్పుడు దానిని సద్వినియోగము చేసిన వారమగుదుము.

శ్రద్ధ :

నీవు చేయుపని యెంత స్వల్పమైనదైనను కానిమ్ము. నీయాపచ్ఛక్తితోడను దానిని నిర్వహింపుము; నీవు అత్యంత ప్రధానమని యెంచు కార్యమునెడ నీవెంతటి శ్రద్ధజూపు దువో, అంతటి పూర్ణ శ్రద్ధను చూపుము. ఏలన అట్టి స్వల్పాంశముల ననుసరించియే నీయోగ్యతనిర్ణయింపబడును.

శాసనకర్తలు :

(స్త్రీలు, ఆయా కులములవారు, వర్గములవారు శాసన సభల లోనికిని, ఉద్యోగములలోనికిని పోయినగాని తమతమ సంఘ ప్రజలకు మార్గముల జూపి, నడుపుచు, వారి యోగ క్షేమముల గాపాడు వారుండరను వాదనకలదు.)

శాసన సభ్యులు ఓటరులకు మార్గము చూపవలసిన వారనుకొనుట వట్టి భ్రమ. ఓటరులు తమ ప్రతినిధులను శాసనసభలకు పంపుట తాము వారిచే నడుపబడుట కొఱకు కాదు. తమ యభిప్రాయముల చొప్పున వర్తించి, తాము నిర్ణయించు కార్యముల నిర్వహించు నిమిత్తమే తమ ప్రతి నిధులను ప్రజలు శాసన సభలకు పంపుచున్నారు. శాసన సభ్యులు ప్రజల సేవకులు మాత్రమే.

శాసన సభ్యులు శాసనకర్తలనెడు భ్రమ యెప్పుడు తొలగునో, అప్పుడు శాసన సభలలోనికి ఎగబ్రాకవలయు ననెడు అసహ్యపు పోటీలు తగ్గిపోవును. అత్యుత్తమ మార్గ

దర్శకత్వము శాసనసభల వెలుపలనుండువారిదని గ్రహింప వలయును. ప్రభుత్వోద్యోగుల విషయమును ఇట్టిదే. నిజ మగు శాసనకర్తలు ప్రజాసామాన్యమే.

శాస్త్రము :

నేడు శాస్త్రావలోకనముపేర జరుగునది, మన వ్యక్తి త్వమును ఉన్నతికి దెచ్చుటకు మారుగా, మనలోని దివ్య శక్తులను ప్రబుద్ధము చేయుటకు బదులు, మిగుల నికృష్టము లగు పేరాశలను పెంపొందించుచుండెనను సత్యమును కాదను వారెవరు?

శ్రామికులు :

యథార్థమునకు సాహుకారు, శ్రామికుడు ఒండొరు లకు పోషకులై యున్నారు; ఇరువురును వినియోగదారులకు పోషకులగుదురు. ఈ పోషక సిద్ధాంతము ఏక పక్షముగ నడు చునది కాదు; పోషకత్వమున ఆధిక్యతా సూచనయులేదు. ఇందు ప్రతివాడును రెండవవానిని నిష్కపటముగ నమ్మ కొని, తనక్షేమము రెండవవాని క్షేమమునందు అంతర్గతమై యున్నదని విశ్వసింపవలయును. "మీరు దేవతలను తృప్తి పఱచుడు; దేవతలు మిమ్ము తృప్తిపఱతురు. ఇట్లు ఒండొ రులు తృప్తిపఱచుకొనుటచేత, ఇరువురును శ్రేయస్సును గాంతురు." అనిగీత బోధించుచున్నది. జగతిలో దేవతలనెడు జాతి వేఱుగలేదు. సృష్టిశక్తిగలవారే దేవతలు. ఆదేవతల సృష్టిశక్తిని వినియోగించుచు సమాజమునకు మేలొనగూర్చు సాహుకారు, శ్రామికుడు దేవతలే కాగలరు.

శీలము :

సత్యధర్మశీలమనగా సామాన్యభాషలో 'సత్యమును పలుకవలయును' అనిమాత్రము చెప్పుకొందుము. కాని దానికి వ్యాపకార్థము కలదు. సంకల్పములో సత్యముండవలయును; మాటలో సత్యముండవలయును; చేతలో సత్యముండవలయును. సంపూర్ణముగా ఈసత్యమును సాక్షాత్కారము చేసికొనిన మనుజునకు ఇక తెలిసికొనవలసినదేమియు మిగిలియుండదు. ఏలయన సమస్త జ్ఞానమును సత్యమునందు ఇమిడియే యుండును.

సంకల్పములు :

నాజాగ్రదవస్థయందు నాసంకల్పములును నాఅదుపులో నుండును. నిద్దురలో ఆ అదుపు కొంత తగ్గుననవలెను. ఐనను నాబ్రహ్మచర్యవ్రతము ఈజన్మలోనె పరిపూర్ణము కానోపునని నాయాశ!

తలపులు పూర్తిగ మనయిచ్ఛావశమై యుండువఱకు, పూర్ణబ్రహ్మచర్య మమరనేర్చు. ఇచ్ఛకువశమై నడువని సంకల్పము మన మనస్సునకొక రోగమనవలెను. కాబట్టి సంకల్పనిరోధమనగా, మనోనిగ్రహమన్నమాట. మనస్సును నిగ్రహించుట గాలిని గుప్పిట పట్టుటకంటె దుస్తరము. ఐనను అంతర్యామిన దేవుడు గలడు గావున ఆమనోనిగ్రహము సయితము సాధ్యమేసుడీ!

సంఘబహిష్కారము :

సంఘబహిష్కారము ప్రాచీన కాలమునాటి ఆచారము. కులపద్ధతితో పుట్టుకొనివచ్చినది... ప్రతిగ్రామమును

స్వపరిపాలనగలిగి స్వయం పరిపూర్ణముగనుండిన కాలమున సత్ప్రయోజనకారిగ ఉండియుండనోపును. ధర్మచ్యుతివాటిలి నప్పుడు, అరుదుగ ప్రయోగింపబడెడిది. అదొక దండనగ గాక, శిక్షణ విధానముగ, స్వయంప్రాయశ్చిత్తమున కవకాశముగ పూర్వఅంగీకారము పడసినది... కాని నేడో, అల్ప సంఖ్యాకులను అధికసంఖ్యాకుల మాటకు లొంగదీయు సాధనముగా వినియోగించుట ఏ యుద్యమమునకైనను వినాశకారియే యగును... కొన్ని యెడల బహిష్కృతునకు వైద్య సహాయముకూడ నిరాకరింపబడునట. అట్టి చర్యకును నరహత్యకును వ్యత్యాసము తోచుటలేదు. యుద్ధములో పట్టువడినశత్రువునకును రోగచికిత్స చేయకుందురే?... ఎదిరిపక్షము వానినిదూషించుట, అవమానించుట, శాపనార్థములు పెట్టుట, అతి నీచమగు అమానుషక్రూరకార్యమగును. సౌజన్యముతో వాదనలు జరిపి, ప్రేమతో ప్రోత్సహించి, ఎదిరివానిని తన ధర్మపక్షమునకు త్రిప్పుకొనుటయే నీతి... వాని అధర్మ చర్యయందు తోడ్పడకుండ నుండవచ్చునుగాక !

### సంఘసంస్కరణ :

రాజకీయ చర్యలు లేనిది సంఘ సంస్కరణ అసంభవమని తేలుటచేతనే, నేను రాజకీయములలో దిగినాను. అటువంటి సంఘ సంస్కరణ, అనగా ఆత్మపారిశుద్ధ్యచర్య, కేవల రాజకీయోద్యమములకన్న నూరురెట్లు నాకు ప్రియతర ధర్మమని చాటగలను.

(13)

**సంఘసేవ:**

సంఘసేవ ఆర్భాటములేకుండ నిశ్శబ్దముగ చేయబడు నప్పుడు మిగుల ఫలప్రదముగ జరుగును. అందుచే నీ ఎడమ చేయి చేయు ఉపకృతి నీ కుడిచేతికి తెలియకుండునంత నిరాడం బరముగ జరుగవలయును.

**సంతాన నిగ్రహము:**

సంతాన నిగ్రహముయొక్క ఆవశ్యకతను గురించి భిన్నాభిప్రాయములకు తావేలేదు. యుగాంతరములనుండి పరంపరా వచ్చుచున్న యేకైకవిధానము ఆత్మసంయమనము; అనగా బ్రహ్మచర్యము. దానిని సాధన చేయువారికి తప్పక మేలుగూర్చు అమోఘమును నిరాపాయమునై యున్నది. సంతాన నివారణకు కృత్రిమోపాయముల కనిపెట్టుటను మానుగా, ఆత్మనియమనోపాయముల కనుగొని ప్రచారము చేసిరేని, వైద్యవరులు మానవజాతి దీవనలను గడించుకొనిన వారు కాగలరు. కృత్రిమ సాధనలు పాపమును పెంచు నను పాయముల మెచ్చుకొను దుష్ప్రయోగములేనుడీ. ఆ కృత్రిమ సాధనల వాడుక చేయుటవలని ఫలితార్థము బుద్ధిచాపల్యము. నాడీబలవినాశనమునుట తథ్యము. బ్రహ్మచర్యము అమోఘమును, పవిత్రమునగు ఏకైక సాధనము. కృత్రిమ సాధనల వలన గర్భధారణను తప్పించుకో జూచుట జాతిని హత్య గావించుటే.

**సంపదల వ్యత్యాసము:**

ధనికులకు దరిద్రులకు నడుమగల సంపదలందలి పెద్ద వ్యత్యాసము సాగివచ్చుచున్నంతకాలము అహింసపై అధా

రము చేసి పరిపాలన విధానమును సృష్టించుట దుస్సాధ్యము. స్వతంత్ర భారత దేశమున, ఢిల్లీలోని మేడలందు నివసించు వారికిని గుడిసెలలో కాపురము చేయు నిరుపేదలకును మధ్య చూపట్టు భేదము ఒక్క దినము సయితము సహింపబడబోదు. జాతి సంపదయొక్క పెద్ద పెద్ద మొత్తములను, తమయొద్ద తాళములు వేసి బిగించి పెట్టుకొనియున్న ధనికులు, తమ ఉన్నతస్థానములనుండి దిగి రావలయును; ఆకలికి మాడుచు కట్టుగుడ్డయు కఱవై కనలుచున్న పేదలు వృద్ధికి రావలసి యున్నది. వారినుండి గుంజుకొనిన ధనమును, అధికారమును ప్రజాసామాన్య క్షేమముకొఱకుగాను బుద్ధి పూర్వకముగా త్యాగము గావింపబడ దేని, రక్తపాతముతో గూడిన విప్లవము ఏదియో యొకనాడు చెలరేగక తీరదు. ఆర్థిక సమత్వమును చేకూర్చుటకు నేనేమి చేసితిని?' అని ప్రతియొక్కడును ప్రశ్నించుకొన వలయును.

సంస్థాన ప్రభువులు:

వాస్తవముగు ప్రజాసేవకులుగా వర్తించుట సంస్థాన ప్రభువులకు విధి. అన్యులు (బ్రిటిషువారు) కల్పించిన హక్కుల సాహాయ్యమున వారి అధికారములనుసాగింపదగదు. ఆయుధబలమువలన చేకూరిన హక్కులను అండగాగొని వారు తమ ప్రభుత్వమును చెల్లింపరాదు. సేవామూలముననను, హెచ్చు తెలివి తేటలు వలనను లభ్యమగు హక్కులను ఆధారము చేసికొని వారు పాలనము చేయవలసియుందురు.

స్వతంత్ర సంస్థాన ప్రభువులు:

స్వతంత్ర భారతములో బిర్లా రాజ్యముగాని, భోపాలు రాజ్యముగాని ఉండజాలవు. ఉండునదెల్ల పంచాయతీ రాజ్యమే... కాశ్మీరములోని సైన్యాయుతుడగు మహారాజునకు ఏమంత ఆధిక్యత యుండబోదు. అక్కడి అధికసంఖ్యాకులగు ముసల్మానులకే హెచ్చుపలుకుబడియుండును. ఇదే సూత్రము హైదరాబాదు, భోపాలు, తిరువాన్కూరు, మైసూరు, బరోడా మొదలగు సంస్థాన ప్రభువులకును అనువర్తించును.

సత్యము:

మనలోనెల్లరును, చిన్నలు పెద్దలు, స్త్రీలు పురుషులు, ఏమిపనులు చేయుచున్నను తినుచుండనీ, త్రాగుచుండనీ, వేకపటలాడుచుండనీ, జాగ్రత్స్వప్నములందంతటను, స్వప్న రహితమగు గాఢనిద్రావస్థలో మనము మునిగిపోవువఱకును, పూర్ణసత్యమునే అనుసరించునెడల ఎంత రమ్యముగనుండును! సత్యస్వరూపుడగు భగవంతుడు నామట్టుకు నాకు అగణిత సంపదరాశిగ తోచుచున్నాడు. మనలో ప్రతివానికిని భగవంతుడుఅట్టివాడుగ గోచరించునుగాక!

సమత్వము:

ఆర్థిక సమత్వమనగా ప్రతివాడును అక్షరాల ఒకే మొత్తమును తీసికొనుటని అర్థముకాదు. నాకు శీతాకాలములో రెండుశాలువలు కావలయును. 'కనుగాంధికి' వెచ్చని దుస్తులే అక్కఱలేదు. నాకు మేకపాలు, నారింజపండ్లు మొదలగునవి అవసరము. వానికి సామాన్యపు తిండిచాలును. ఈకారణముచేత మాయిరువురిమధ్య ఆర్థికసమత్వము లేనట్లు

కాదు. ఏనుగునకు చీమకు కన్న ఎన్నిరెట్లో ఆహారము కావ లెను. అది అసమతకు నిదర్శనముకాదు.

ఇట్లని, ధనికులకును దరిద్రులకును, భూపతికిని బిచ్చ గానికిని మధ్యగల తారతమ్యముల నెవరును సమర్థింప జూడ కుంద్రుగాక.

ప్రతివానికిని అవసరముకొలది పోషణ కల్పించుట, వాని సామర్థ్యము కొలది పనిచేయించుట, ఈతీరు దౌర్జన్య రహిత విధానముపైన ఆధారపడి, భారతదేశపు పల్లెలకు అను గుణ్యమగు 'కమ్యూనిస్టు' ప్రయోగకూటములేమాఆశ్రమములు.

పేదలగు పల్లెలవారు పాల నుత్పత్తి చేయుదురు. వారి పిల్లలకు పాలు కఱవే. వారు ఆహారోత్పత్తి చేయుదురు. వారికి తిండి కొదువయే. ఇది లజ్జాకరము. ప్రతివానికి పుష్టి కరమగు తిండి, నివాసమునకు ఇల్లు, బిడ్డలకు అర్హమగువిద్య, వైద్యసాహాయ్యము అందుబాటులో నుండవలయును. ఇది నా ఆర్థిక సమత్వము.

ఐనను కేవలావసరమునకు మించిన సర్వమును నేను నిషేధించను. పేదల అవసరములు అన్నియు తీరినవెనుక ఎవరి కేని అట్టి అవకాశము ఉండనగును.

సత్యాగ్రహము:

సత్యాగ్రహము సార్వజనీన ప్రయోగార్హమైన ధర్మము. స్వంతకుటుంబమునందు ప్రారంభించి మఱే యితర క్షేత్రమునకైనను వ్యాపింపచేయదగును.

సత్యాగ్రహము విజయవంతమగుటకు అవసరములగు నియమములు: (1) సత్యాగ్రహి తనయెదుటి పక్షము నెడల తనహృదయములో ద్వేషము పూనదగదు.

(2) సాధింపబూనిన విషయము యథార్థమైనదిగను, ప్రయోజనకరమైనదిగను ఉండవలయును.

(3) ఆవాంఛితార్థముకొఱకై సత్యాగ్రహి తుదివఱకును కష్టములను సహించుటకు సంసిద్ధుడై స్థిరసంకల్పము గలవాడుగ నుండవలయును.

సత్యాగ్రహము హఠాత్తుగ చేపట్టగల వ్రతముకాదు. ఇతర సామ్యోపాయముల నన్నింటిని ప్రయోగించిన పిమ్మటగాని సత్యాగ్రహదీక్ష పూనదగదు.

'నిస్సహాయులకు భగవంతుడే సహాయ్యము' అను విశ్వాసముపై నాధారపడియే సత్యాగ్రహోద్యమ మహాసిద్ధాంతము నిర్మాణమైనది. భగవంతుడు నిస్సహాయులగు వారికి సాయపడునె గాని, తామేమో చేయగలమని విశ్వసించువారికి సాయపడడు.

## సత్యానుసరణము:

సత్యానుసరణమనగా సత్యమునకు భక్తి అన్నమాట. అది భగవంతునికడకు తీసికొని పోవును. ఆ మార్గమునందు పిఱికితనమునకు తావులేదు. అపజయమునకు తావులేదు. మరణమును సయితము అమరజీవనమునకు ద్వారము తెరచు సాధనముగ మార్పుచేయగల రక్షాబంధనమే అది.

సభ్యత్వ ఉద్యోగము :

రాజ్యాంగ నిర్మాణసంఘములకు ఎట్టివారైనను తగుదురని భావించుట, కులముల పరిగణనను మదిలోనుంచుకొనుట పొరపాటగును. ఎన్నికలవలననేమో గౌరవమువచ్చి పదవులనుకొనుట తప్పు. శ్రమపడి అచ్చట పనిచేయుట కష్టమగువానికి అదొక ఉద్యోగము మాత్రమే. అట్టి ఉద్యోగమున నున్నంతకాలము డబ్బుసంపాదించుకొనవగునని యాశపడుట యింకను తప్పు... ప్రపంచమంతటి రాజ్యాంగ నిర్మాణముల గురించియు, భారతదేశపు విశిష్ట సంస్కృతికి అవసరమగునట్టి శాసనముల గురించియు విజ్ఞానము కలిగి సేవచేయబూనువారే అట్టిసభలకుబోవ నర్హులగుదురు. ఇతరులు ఆ పదవులు స్వీకరించుట ద్రోహకార్యమే యగును.

సమానత్వము, కమ్యూనిజము

పర్యవసానమునకు కమ్యూనిజము అనగా నేమిటి? ఆంతరవిభేదములేని సమాజ మన్నమాట. మనమందఱము సాధింపదగిన ఆదర్శమే. కాని బలాత్కారము పొడసూపినంతనే దానినుండి నేను సెలవుదీసికొందును. హెచ్చు, తగ్గు అనుభావమే అనర్థము. ఐనను దౌర్జన్యసాయమున ఆ అనర్థమును తొలగించుటన్న నాకుగిట్టదు.

స్వదేశీ :

మనకు దాపున నున్న పరిసరములనే వినియోగము చేసికొనుచు, వానికే సేవలు చేయుచు, దూరాన నున్నవాని ప్రమేయమును అత్యవసరమున్నగాని పెట్టుకొనజూడని భావమునే స్వదేశీ అందుము.

రాజకీయములందు నా దేశమున పెరుగు సంస్థలను ఉపయోగించుకొనుచు, వానియందుగల్గు నుజ్జైన దోషములను తొలగించుటకై శ్రద్ధతీసికొనుచు, ఆర్థికముగ నాప్రాంతమున ఉత్పత్తియగు వస్తువులనే వాడుకొనుచు, ఆపరిశ్రమలను అభివృద్ధిపరచి శ్రేష్ఠమయినవానిగ జేయుటలో తోడ్పడుచు దేశసేవ చేయుటలో ఉపయోగపడుట నావిధి.

స్వ ధ ర్మ ము :

నిష్కామకర్మగా నీ స్వధర్మమును నీవు నిర్వహింపవలయును. అందుమూలాన నీనెవనికో మేలుచేయుచున్నానను తలంపు పూనరాదు. అది కేవలము నీ విధి.

స్వ రా జ్య ము :

స్వరాజ్యము అక్షరాస్యుల గుత్తసొత్తుకాదు. డబ్బుగలవారి స్వంతమును గాదు. స్వరాజ్యమనగా కర్షకునితోసహా యెల్లరకు, కుంటివానికి, గ్రుడ్డివానికి, ఆకలికి అలమటించుచు కూలిచేయువానికి యిట్టిలక్షలాది జనముల కందరికిను ఉపకరింపవలయును. అందలి పాలనాధికారము వీరందరి అదుపులో నుండవలయును.

స్వరాజ్యమనగా తననుతాను అదుపులో నుంచుకొనుటని నిజమగు అర్థము. ఎవడు నీతిధర్మములను అనువర్తించునో, ఎవడు సత్యమును విడనాడడో, ఎవడు మోసముచేయజూడడో, ఎవడుభార్యయెడను, సంతానమునెడను, తల్లిదండ్రులయెడను, పొరుగువారియెడను, సేవకులయెడను తన విధుల నిర్వహించునో అట్టివాడుమాత్రమే తననుతాను

అదుపుచేసికొనగలవాడగును. అట్టివాడెచ్చోటనున్నను సరియే స్వారాజ్యము ననుభవించు వాడే యగును.

**సాధన సాధ్యములు:**

"ఏమైనను సాధనలు సాధనలు మాత్రమేగా ?" అనుచుందురు. "ఎందుకైనను, సాధనలే సర్వాధారముగదా ?" అని నేనందును. సాధన సాధ్యముల వేఱుపఱచు గోడలేదు. సృష్టికర్త సాధనల మీదమాత్రమే మనకధికారము నిడియున్నాడు; (అదియు మిగుల పరిమితముగనే); సాధ్యముపైన నిసుమంతయు నిడియుండలేదు. ఆ సాధ్యప్రాప్తి సాధనల నిష్పత్తి ననుసరించియుండును.

అనుకూలముకొలది స్థిరత్వము చూపువాని శ్రద్ధ అల్పమైనది. ప్రతికూల దశలందును ప్రకటితమగు ధృతిమాత్రమే యథార్థమగునది.

**సాహాయ్య నిరాకరణ:**

సాహాయ్యనిరాకరణమనిన పరిపాలనను స్తంభింపజేయుటని యెన్నడును చెప్పియుండలేదు. దాని ప్రధాన లక్ష్యము ఆత్మపవిత్రీకరణమే. ప్రజల అవినీతిని, దుర్బలతను ఆధారము చేసికొని బ్రతుకు దొరతనము స్తంభించిపోవుట దాని ప్రప్రథమ ఫలము.

దానిమూలమున ప్రజలు తమశక్తిసామర్థ్యములను గుర్తింపజాలుదురు. క్రమశిక్షణము, ఆత్మనిగ్రహము, సమిష్టి కార్యాచరణము, దౌర్జన్యరాహిత్యము, సంఘటనాచతురత, అనువానిని అలవఱచుకొందురు.

కుటిల కల్మష రహస్యోపాయములచేత బ్రిటిషు మహా జాతిని పరిపూర్ణోన్నత్యమునకు దీసికొనిపోజాలరు; పగటివేళ నిండువెలుతురులో మాయుద్యమ సన్నాహములను ధైర్యముతో సాగించుటవలన, నీతిమాలిన రహస్యపు పోలీసుశాఖ చర్యలు ఎందును కొఱగానివై పోవును.

సాహాయనిరాకరణోద్యమము మనుష్యులకు వ్యతిరేకముగ సాగింపబడునది కాదు; అది దుష్టశాసనములకు వ్యతిరేకముగ సాగించునది. అది గవర్నరులకు విరుద్ధముగ నడుపబడునది కాదు; అది వారు పాలించు విధానములకు వ్యతిరేకముగ నడుపబడునది. సాహాయ్య నిరాకరణ శిబిరములకును, రహస్యమగునట్టిగాని, బహిరంగమగునట్టిగాని రాజకీయకుతంత్రములకు నెంతమాత్రము సంబంధము లేదు. ఈయుద్యమము ఆంగ్లులను దేశమునుండి తోలివేయుట కొరకేర్పడినది కాదు; అదిమన నెత్తిపై మోపబడిన పరిపాలనా విధానమును మార్చుటకో, అది వీలుపడనియెడల, దానిని పరిమార్చుటకో ఉద్దేశింపబడినది.

నాసాహాయనిరాకరణధర్మము (అనేకులు భారత స్త్రీలను, బిడ్డలను, పురుషులను హింసించి, వధలు సయితము చేయించిన) జనరలు డయరు, మైకేలుఒడయరువంటివారి యెడ సయితము మిత్రభావము చూపుటకు అడ్డమురాదు. అదియెవరికిని కీడుచేయునది కాదు. అదిదుష్టవిధానముతోడను, పాపముతోడను సాహాయ్య నిరాకరణము చేయునే గాని పాపకర్మునితోడ కాదు.

పాపమును ఏవగించుకొనుము. పాపిని దయచూడుము.

స్వాతంత్ర్యము :

నరునకు తన స్వాతంత్ర్యమును ఎట్లు వినియోగము చేసికొనుటకో నిర్ణయించుకొను స్వేచ్ఛయున్నట్టులనే, అనగా అట్టి అర్థమునందే 'నరుడు తన గతికి తానె నిర్ణయకర్త' యగుచున్నాడు.

స్థిరత :

మన యుద్యమములు రెప్పపాటు కాలములో రూపుమాసిపోగలవు. అంతటి వేగముతోడనే, మనకు తెలియకుండనే, మనము మన ఉద్యమములను విడిచిపెట్టి పోవలసిన వారమగుదుము. ఐనను మనము భగవంతునికొఱకును, వాని ఉద్యమముల కొఱకును సేవ చేయు వారమగుదుమేని, పర్వతముల బోలు సుస్థిరులముగా నెంచుకో దగును.

సేవ :

నిరుపేదలతో ఐక్యభావమంది వారికి సేవయొనర్పని వాడు ఆత్మసాక్షాత్కారమును పడయజాలడు.

శరీరము సేవార్థమే గాని భోగార్థము కాదు. నిస్సంగ భావముతో చేయబడు కుటుంబ సేవ జాతీయసేవగా పరిణమింపనగును.

సాక్షాత్కారము :

సాక్షాత్కారము వాంఛించుచున్నాను. అతడు సత్యస్వరూపుడని యెఱుగుదును. ఆతని సాక్షాత్కరింప జేసికొను సాధనము దౌర్జన్యరాహిత్యము; అనగా అహింస.

గ్రామప్రజలసేవవలన నా ఆత్మ సాక్షాత్కారమును సిద్ధింపజేసికొనుచు, ఇతరుల కెవరికోగాక, నాకు నేనే సేవ జేసికొనుచున్నాను. సాంఘికమైనను, రాజకీయమైనను, ఆధ్యాత్మికమైనను నరుని కర్మలన్నియు తుదకు పరమాత్మ దర్శనము కొరకై యే సాగింపబడవలసియున్నవి. భగవంతుని వాని సృష్టియందు సాక్షాత్కారము చేసికొను దృష్టితో, ఆ సృష్టితో ఐక్యానుభూతిని పొందుటయే, భగవంతుని దర్శించుటకు నరునికిగల ఏకైకమార్గము.

సైనిక శిక్షణ:

యుద్ధసైనికులకువలెనే, శిక్షణలు, డ్రిల్లు, సమిష్టిఆట పాటలు, జెండాలు, సిగ్నలులు వంటివి ఉండవచ్చును. కాని అహింసా సైనికులకు అచంచల భగవద్భక్తి, శాంతి, తమ నాయకునియెడ అకుంఠితమగు విధేయత, వివిధశాఖల మధ్య ఆంతరంగిక, బహిరంగిక సంపూర్ణ సహకారము ఉండి తీరవలయును.

ఇండియా, యింగ్లాండులవంటి దేశములు పూర్ణముగ సైనిక పటుత్వమును నిలువబెట్టుకొనుచును, సాత్విక నిరోధ ప్రయోగమునుచేసి పరీక్షించుదమనుట ఎట్టి స్థితియందును పొసగునది కాదు.

సోషలిజం:

నాకును జవహర్‌లాలుకును, మధ్య సోషలిజమును గురించి విభేదములు గలవా? అని ప్రశ్నింతురు. ఆయన 'సిద్ధి' పక్షమున ప్రాధాన్యత నిచ్చును. నేను 'సాధన' పక్షమున ప్రాధాన్యత చూపుదును. నాకు అహింస అత్యధిక

ప్రధానమైనది. ఆయనకు అహింసయందు ఆదరమున్నను సోషలిజమును సాధించుట యితర మార్గములందు సాధ్యపడనిచో హింస ఆయనకు త్యాజ్యముకాదు. నా అహింసా ప్రాధాన్యత ధర్మసంబంధమైనది; ఏసందర్భమునను విడువ వగినదికాదు. స్వాతంత్ర్యము అహింసాద్వారమున సాధ్య పడని యెడల నేనద్దానిని కోరుకొనను. అట్టిది యథార్థమైన స్వాతంత్ర్యమే కాదందును.

భారత దేశమున ఎవరును సోషలిస్టుదీక్ష వహించుటకు పూర్వమే నేను సోషలిస్టునైతినని చెప్పగలను. అహింసా ధర్మమునుగూర్చిన నావిశ్వాసమే అందుకు మూలకారణము.

**సౌ ధ ము లు :**

భారత దేశమున మనకంక్షబడు ప్రతిసౌధమును దేశ సౌభాగ్యమునకు నిదర్శనముకాదు. సక్రమముగ ఆదరింపక కోటానుకోట్ల పేదకూలిజనులయెడ గావించిన అన్యాయ ముచే చేకూరిన ధనమును చూచుకొని కులుకు కొలదిమంది యొక్క నిర్దాక్షిణ్యమునకు చిహ్నమగును.

**స్త్రీ :**

స్త్రీలు పురుషులను అనుకరించుట వలనగాని, వారితో పోటీలు పడుటవలనగాని, ప్రపంచమునకు తమవంతు మేలును చేకూర్పజాలరు. అట్టిపోటీలవలన స్త్రీ తానుపొందవలసిన ఉన్నతిని సాధింపజాలదు. స్త్రీ తనప్రస్తుతపు హీనస్థితిని గుఱించిన యథార్థమును తెలిసికొనుటకు ఆమె యీనాటి చదువులను, ఉద్యోగములను పొందుట అనవసరము. తనహీన స్థితిని గుర్తించుటకు, దానిని నివారించుకొని తననుద్ధరించు

కొనుటకు ఉచితమగు ప్రబోధమును పొందుట అవసరము.

స్త్రీ పురుషునితో సమానముగా బుద్ధిశక్తిని కలిగి యున్నది. వానిచర్యలన్నింటను ప్రత్యంశమునను వానితో సహకరించుటకు అధికారము కలిగియున్నది. వానితోపాటు స్వేచ్ఛాస్వాతంత్ర్యములను అనుభవించుటకు పూర్ణముగ అర్హతకలిగియున్నది. పురుషుడు తనక్షేత్రములో నట్లే, స్త్రీయు తనక్షేత్రములో ఉత్తమస్థానము నాక్రమింపవలయును.

గృహము వెలుపల జరుగు కార్యములందు పురుషునిదే ప్రధాన స్థానము... గృహము పూర్తిగ స్త్రీయొక్క ధర్మక్షేత్రము. బిడ్డలను పెంచుటనుగురించియు, వారికి ఉచిత శిక్షణ గఱపుటనుగురించియు స్త్రీకి పురుషునికంటె హెచ్చు విజ్ఞానము అవసరము.

స్త్రీకిగాని, పురుషునికిగాని నేర్పుబోధనాంశముల నిర్ణయించుపట్ల విచక్షణతో ఈ సూత్రములను దృష్టిలో నుంచుకొనవలయును.

భావిసంతతివారినిపోషించువారు స్త్రీలే గాన, భారతదేశ భవితవ్యము మీపాదములపై నాధారపడియున్నది. భారతశిశువులను నిరాడంబరులుగను, భగవద్భక్తిపూర్ణులుగను, సాహసవంతులుగను నగు స్త్రీపురుష గణముగా సాకగలవారు స్త్రీలే.

ప్రపంచములో మీవంతుమీరు చెల్లింపజూతురేని, పురుషుని మెప్పునిమిత్తము మీరు అలంకరించుటకు ఒడంబడకుడు. పురుషులకు దాసీలైపోవ నొడంబడకుడు. సింగారించుకొన నిరాకరించుడు. సువాసన తైలములకును, లవండరు నీళ్లకును పర్వులిడకుడు. మీరు సువాసనలు వెదజల్లజూతురేని

అవి మీహృదయములందే గలవు. వాని ద్వారమున మీరు పురుషులనేగాదు, మానవలోకమంతటిని అలరింపగల్గుదురు. అయ్యది మీనైసర్గిక సంపద.

**స్త్రీ సమర్థన:**

వేలకొలది స్త్రీలు నిర్భయముగా కల్లు దుకాణములకడ నిలిచి త్రాగుబోతుల నెందఱినో బతిమాలి జయప్రదముగా వారిని నివారింపగల్గిరి. తామైచ్ఛికముగాపూనుకొనిన యీ యుద్యమనిర్వహణమునందు త్రాగుబోతుల తిట్లను, కొన్నిసమయములందు వారిచే దెబ్బలను సయితము వారు భరించిరి. కల్లుదుకాణములవద్ద పికెటింగ్ చేసిన నేరమునకై వందలాదిస్త్రీలు జైళ్లకు పోయియుండిరి.

**హరిజనులు:**

ఎన్నియుగములనుండియో సవర్ణప్రజలు, స్త్రీలును, పురుషులును హరిజనులను హింసించియున్నారు. మనమీనాడు ఇడుమల గుడుచుచుంటిమన మనము హరిజనులయెడ గావించియున్న అపరాధము అందుకు కారణమని నానమ్మకము. కాబట్టి మీహృదయములనుండి అస్పృశ్యతా పిశాచమును పారద్రోలుడని మిమ్ములను నేను వేడుకొనుచున్నాడను.

**హరిజనసేవ:**

మన కీనాడు మతమనిన ఆహార పానీయములంగూర్చిన కొన్ని పట్టుదలలు, ఉచ్చనీచ భావములు తప్ప వేఱేమియు లేకుండ పోయినది. జననమును, ఆచారమును ఉచ్చనీచ దశలను నిర్ణయింప జాలవు. శీల మొక్కటియే అట్టి నిర్ణయమునకు ఆధారము. మీరు హరిజనులతో మైత్రి సలిపి, వారి

కూడెములకు పోయి, మీ బిడ్డలను కౌగలించుకొనుతీరున వారి బిడ్డలను కౌగిటచేర్చికొనుచు, మీ యోగ క్షేమముల విచారించుకొను వడువున వారి నభిమానించి, వారికి చాలి నంత తిండియున్నదో లేదో, త్రాగుటకు శుద్ధ జలమున్నదో లేదో, మీరనుభవించుట కధికారమున్న విధమున వారికి మంచిగాలి, యెండ అనుభవించు వసతులు కలవో లేవో విచారించుచు వారితో సహకరించు టొక్కటియే యిన్ని శతాబ్దులనుంచి మీరు సలుపుచు వచ్చిన మహాపాపమునుండి మీరు పునీతులు కాగల్గుటకు శ్రేష్ఠతరోపాయము.

హింసకుడు :

హింస నెదిరించుటకు హింసకుని హింసించుట శ్రేష్ఠ తమ మార్గము కాదు. వాని దుర్నీతి దోషయుక్తమనుపట్ల, మన అసమ్మతిని తెలిపి, అందువలన ఎట్టి నష్టము ఫలితా ర్థము వచ్చినను సంతోషముతో అనుభవించుచు, వాని యిచ్ఛకు లోబడక ధైర్యముగ నిలువ బడవలయును.

క్షేమము :

పనివాండ్రు అనారోగ్యులై పోయి దిగులున కూలు నంతగా తక్కువ కూలినిచ్చుట యజమానికి క్షేమముకాదు. యజమాని వ్యాపారమును సురక్షితముగను, ఉదారముగను, నడుపుటకుఅడ్డుపడునంతగా వానిలాభములుతగ్గిపోవువిధమున కూలి నిమ్మని తగవులాడుట పనివాండ్రకును క్షేమముగాదు.

పని సక్రమముగా జరుగుట, దానినుండి న్యాయమగు లాభము వచ్చుట, ఉభయులకును క్షేమంకరమగును. కాని లాభము పంచుకొనుటలో ఒకరిలాభము మఱొకరి నష్టము కాదగదు.